





# నాటకాలు

భక్తి,జ్ఞాన,పురాణ,జానపద

# మారుతి సేవ





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050016022

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# మా రు తి సే వ

గ్రంథకర్త:

ముక్కామల పున్నయ్య.



మొదటి కూర్పు 1000 ప్రతులు

1937

వెల రు. 0—8—0.



ఓం

శ్రీరామాయనమః

# మారుతి సేవ

## ప్రథమాంకము

### ప్రథమరంగము.

దండకారణ్యము—పర్ణశాల

( ప్రవేశము:— శ్రీరాముడు, సీత )

శ్రీరా:—(సీతతో) ప్రేయసీ! చూచితె! యీగౌతమీ తీరమందలి వనప్రాంతము.

ఉ॥ శ్రీకరమయ్యె దిక్కులకు । జిగ్గులద్దుచు వింతశోభలన్
పోకలుపొన్నలాదిగల । భూజములెన్నియొ మిన్నునంటెడున్
ఆకసవీథి పుల్గుగము । లల్లన బాఱె జవాతిరేకతన్
భీకర గౌతమీసలిల । వీచికలాడెడు లోలలోచనా! ॥

సీత:— నాథా! యీ వనసౌందర్యంబున కేమిగాని, యల్లదే! యీ రసాల వృక్షచ్ఛాయం దిరుగాడు నాహరిణరాజంబు గాంచితిరే?

పాట—1

తే॥ గీ॥ పరవశుల ద్రొక్కుచును లేత । పసిడిపచ్చి
కలమెసంగుచు దిరుగు మృ । గంబుగనుమి

ఆమృగాంకు నెల్లిదము సే కయంగ నెంచి
పాటివచ్చు దానివలె గ కన్పట్టు నాథ॥

నాథా! నాకోర్కె దీర్పరా! దయయుంచి ఆ మృగమును బట్టి తే ప్రార్థించెద.

శ్రీరా:— జానకీ! యిదియా నీ యభీష్టంబు! క్షణమాత్రంబున నాకు రంగరాజమున్బట్టి నీ మనోభీష్టంబు నెరవేర్చెద.

(లక్ష్మణుడు ప్రవేశము)

(శ్రీరాముడు లక్ష్మణునితో) లక్ష్మణా! యిక్కాననంబున, మానవాంతకులగు దానవాధములు పెక్కండ్రు సంచరించుచుందురు. క్రూరమృగంబు లెల్లవేళలం దిరుగాడుచుండు. కావున జాగరూకుండవై మీ వదినను గాపాడుచుండుము. నే నిదే యీ హరిణంబును బట్టితెచ్చెద (అని వెళ్ళబోవును.)

లక్ష్మణుడు:—(వారించి) అగ్రజా!

తే॥ గీ॥ జానకీదేవి హృదయ వాంఛితార్థమీరు
మంచి చెడ్డల నరసి యోజించి చనగ
నీకు దలపంగ నసురేది నిజ మెఱుంగ
గార్యసాధనలకును దుర్ఘటము గలదె॥

శ్రీరాముడు:—లక్ష్మణా! యీ స్వల్పకార్యంబునకై యింత యోజింప నేల. నీవు కడు జాగరూకుండవై మెలంగుము. నే బోయి వచ్చెద (శ్రీరాముడు నిష్క్రమించును)

(అవనిక జారును)

ద్వితీయ రంగము—అరణ్యము.

(మాయలేడి వెంట శ్రీరాముడు త్వరితగమనుండై ప్రవేశించును.)

శ్రీరాముడు:—ఆహా! యేమిది!

పాట—2

ఉ॥ ఏ యసురాధముండొ నను । నీవిధి మోసముజేయ నెంచి తా
గాయము మార్చెనే యిటుల । గాంచనరూపమృగాకృతిన్ కనన్
మాయురె! గ్రెల్లుదాటిమటు । మాయముతోఁ కనుమాయనింతలో
నేయరుదెంచు చెంగటకు । నేమి మహాద్భుత చిత్రవర్తనల్॥

కానిమ్ము, దీని మదంబడగించెద.

(మాయలేడిపై బాణమ్ము వేయును.)

(తెరలో) హా! సీతా! హా! లక్ష్మణా! రక్షింపుడు, రక్షింపుడు.
అని మాయలేడి (శ్రీరాముని కంఠస్వరముతో నరచును)

(అవనికజారును)

తృతీయ రంగము.

పర్ణశాల

(సీత కూర్చునియుండును, లక్ష్మణుడు నిలువఁబడియుండును)

సీత:—(ఆతురతతో) అన్నా! సౌమిత్రీ! వింటివే! మీయగ్రజున కేదియో యాపదసంభవించినది. “హా! సీతా! హా! లక్ష్మణా! రక్షింపు” డని యార్తనాదము వినంబడుచున్నది. నీవు సత్వరమేగి మీయన్నగారికిఁ దోడ్పడుము.

లక్ష్మ:— అమ్మా!

ఆ॥ వె॥ చింతనొంద దగదు । వింతమృగము దాని
మడియఁ జేసియన్న । మరలునమ్మ
అన్నయాజ్ఞ మీరి । యరుగనేనటుపైని
జెనుగుగల్గు భయము । విడువుమమ్మ

మాయన్నకేమి, యాపద సంభవించుటేమి! యిదికల్ల. ఆ కంఠధ్వని మా యన్నగారిదికానేరదు, ఎవ్వడో యొక మాయ

రక్కసుఁడు మనలను మోసముజేయనెంచి, యీపగిది
కారులఁ బేలియుండె. యిందులకై మీరు చింతింపవలదు.
ఆ దానవాధము నుక్కడంగించి యిప్పుడే మా యగ్రజుం
డిటకరుదెంచు. మీరు మనంబున భయంబు దక్కియుండుఁడు.

సీత:— అయ్యో! లక్ష్మణా! యిదియేమి! యీ నాడిట్లుబల్కుచుంటివి.

ఉ॥ ఆ పదసంభవించెనని ♦ యన్నయదే యెలుగెత్తి పిల్వనీ
వీ పరిదిఁజరింప గన ♦ నేదియొ వింతగదోచె నెమ్మదిన్
నాపతి కేమికీడగునొ ♦ నాగతి యక్కట! యెట్టులౌనొ, హా!
పాపపుకార్యమేదయిన ♦ భావమునందు దలంతె మూర్ఖుడా!

సౌమిత్రీ! అన్న లేకున్న. యగ్రజునిభార్యను చేబట్టమనసు కలిగె
నా యేమి.

లక్ష్మ:— శివ, శివా ( యని చెవులుమూసికొనును )

ఉ॥ అమ్మరో! యెట్టి పల్కువిన ♦ నయ్యెను నేడిటు, కాననంబునన్
మిమ్ముల వీడి యేగుట ది ♦ మేలగుకార్యము గాదటంచునా
నెమ్మనమందు నెంచియిట ♦ నిల్వగ దారుణ వాక్యబాణముల్
ఱొమ్ముననాటి వైచితివి ♦ రూఢి దలంపక, నేమిసేయుదున్!

తల్లీ! ఎట్టి కఠినోక్తుల బల్కితివి! మా యన్న యానతి మీరఁ
జాలకయు, నా మహామహుని శక్తి నేనెరింగియే యిట్లు వచింప
మీ పరుషవాక్యశూలములచే నన్నుఁ బొడిచివైచితిరి. ఇఁక నే
బోయివచ్చెద (అని పర్ణశాల చుట్టును గీతగీసి) తల్లీ! మీ రీ
పర్ణకుటీరమును దాటి యెందేగినను ప్రమాదము వాటిల్లును.
కపటోపాయులగు దానవులు పెక్కండ్రు యీ ప్రాంతమున
విచ్చలవిడి సంచరించుచుందురు. జాగరూకులరై మెలంగుడు. నే
బోయివచ్చెద (నాలుగడుగులు ముందుకు వైచి)

పాట—3

ఆహా ! పోవుదమన్న మనంబు కీడునే శంకించుచుండె.

ఉ॥ క్రూరులు దానవాళియిట ¦ గ్రుమ్మరుచుందురు భద్రమంచు నా
ధూరమణుండు నాజ్ఞ నిడ ¦ భూమిజ నిచ్చటఁ గాచుచుండ నట
దారుణవాక్యముల్పలికి ¦ తానిటు బంపుచునుండె నేదియో
ఘోరము సంభవించునని ¦ గుండెదు నామది నేడిదేలకో॥

(యించుక యాలోచించి) విధిలేదు. పోవనేవలయు.

(నిష్క్రమించును.)

(యతివేషధారి యగు రావణుడు ప్రవేశించును.)

రావణుడు:—ఆహా ! యేమి ! యీ మోహనాంగి రూపలావణ్యము !

ఉ॥ ధారుణికన్య మోముగన ¦ ధాత చమత్కృతి తేటతెల్లమౌ
నీరమణీయరూపవతి ¦ నింతకుమున్నెట గాంచనైతి హా !
మారునిజన్మ ధన్యమయె ¦ మామకజన్మ తరించె నిప్పుడే
యారయ నీమెనుంగొనుచు ¦ నబ్ధిని దాటుట యుత్తమంబగున్॥

(పర్ణశాల యెదుటకు వచ్చి)

భవతిభిక్షాందేహి (యని కేకవైచును.)

(సీత భిక్షము గైకొని పర్ణశాలను దాటివచ్చును. రావణుడు నిజరూపము దాల్చును. సీత మూర్ఛపోవును. రావణుడు గడ్డను పెకలించి సీత నెత్తికొని, రథారూఢుడై దక్షిణాభిముఖముగాఁ బోవును.)

సీత:—హా ! రామా! రామా ! రక్షింపుము, రక్షింపుము.

(అని దుఃఖించును.)

(అవనిక జారును.)

## చతుర్థ రంగము—అరణ్యము.

(సీత యొక్క ఆర్తనాదము విని జటాయువు ప్రవేశము)

జటాయువు:— యెచ్చటదీఆర్తనాదము! (ఆకసము వైపుజూచి) ఓరీ! రావణ! వినాశకాలే విపరీతబుద్ధి, యన్నట్లు నీకుఁజెడుకాలము దాపరించి, యీ దుర్బుద్ధి పుట్టినది. దేవాది దేవుండగు శ్రీరామచంద్రుని భార్యనిట్లు మోసముచే నపహరించి గొని పోవుచుంటివి. నీకు ప్రాణంబులపై నాశగలదేని, మాసీతా మాతను శ్రీరామచంద్రున కప్పగించి, యా మహాత్ముని చరణారవిందములకడ వ్రాలి, తప్పుక్షమింప వేడి, నీదారిన్జనుము. లేదేని, నిన్నిప్పుడే చించిచెండాడెద.

రావణుడు:— ఓరీ! దుర్మతీ! నీకింత కండ కావరమా! సకలలోక భయంకరుండనగు నన్నెరుంగక నోటికివచ్చినట్లు ప్రేలుచుంటివి. ఇదే మదీయ కరవాలంబున నిన్నిప్పుడే యమలోకంబున కతిథిఁ గావించెదఁగాచికొమ్ము.

(జటాయువు రావణు నెదిరించి యుద్ధముజేయును. రావణుడు జటాయువు పక్షంబులఁ దెగవేసి, సీత నెత్తుకొని పోవును.)

జటాయువు:— హా! రామా! రామా! రక్షింపుము. రక్షింపుము.

( అవనికజారును )

## పంచమరంగము.

### అరణ్యము.

(లక్ష్మణుండు, శ్రీరాముని వెదకుచు బోవుచుండ, శ్రీరాముఁడెదురై)

శ్రీరాముడు:— సౌమిత్రీ! యిదియేమి! మీావదిననొంటిగా విడచి యిటులవచ్చితి!

పాట— 4

తే॥ గీ॥ క్రూరమృగ దుష్ట దానవ చోరులకును
యాల వాలమై దనరారు యడవిలోన
నబల నొంటిగ విడిచి రా నౌనె! యేమి
కీడు మూడంగ నౌనో యీ నాడుమనకు॥

లక్ష్మణుడు:— పాట— 5

అగ్రజా! క్షమింపుము. ఆ దానవాధముండు "హా! సీతా! హా! లక్ష్మణా! రక్షింపుము" యన్న ఆర్తానాదము విని యా యమభీతిల్లి, లక్ష్మణా! మీయగ్రజున కేదియో యాపద సంభవించె, పోయి తోడ్పడుమన, అమ్మా! మాయన్న కెందు నాపదరాఁజాలదు. ఎవ్వఁడోయొక మాయరక్కసుఁడు మనలను మోసగింపనిట్లుకారులఁ బ్రేలియుండె. వానినిప్పుడేసంహరించి మాయన్న రాఁగలఁడని నుడివితి. అందులకామె నాపైఁగోపించి నిష్ఠురోక్తులాడె, విధిలేక నేనిట్లు రావలసివచ్చె.

శ్రీరాముడు:— పాట— 6

విధి వ్రాతతప్పింప నేరికిదరమగు. కానిమ్ము. పర్ణశాల కడ కేగుదమురమ్ము.

( ఇరువురువిచారముతో నిష్క్రమింతురు)

(అవనికజారును).



ఓం

శ్రీరామాయనమః

# మారుతి సేవ

## ద్వితీయాంకము.

ప్రథమ రంగము—పర్ణశాల.

(ప్రవేశము: శ్రీరాముడు, లక్ష్మణుడు విషాదముతో)

శ్రీరాముడు:— పాట—7

ఆహా ! గుట్టలనక, చెట్టులనక, పుట్టలనక నానాప్రదేశంబులు వెదకి వెదకి వేసరితిమి. యెందును జానకి జాడిసుమంతయు గానుపింపదయ్యె. యేక్రూరుల పాలఁబడి యెంత [illegible]పించు చున్నదోగదా ! హా ! దైవమా !

తే॥ గీ॥ తలఁచి తలచియుఁ దానెంత | కలఁతఁ బడెనో
చెలియవార్త లోకింతయు | దెలియవయ్యె
నేమిసేయుదు, నే నెట | కేగువాఁడ
నెట్లు బ్రతుకుదు నీ భువి | నింతి వీడి॥

లక్ష్మణుడు:—అగ్రజా ! చింతింపకుడు.

పాట—8

తే॥ గీ॥ శోకభారంబుచే మీర | లీకరణిని
కాలహారణంబు గావింప | గలదె దిక్కు—

జాగుసేయక జానకి జాడ నిపుడె
యరయుగావలె సోదరా! యమలచరిత! ॥

శ్రీరాముడు:—(దుఃఖముతో) లక్ష్మణా! మహా పారావార తరంగములవలె, పొంగిపొరలి వచ్చుచున్న దుఃఖమున మునింగియున్న చిత్తమును మరల్పఁజాల కిట్లుంటి. యేమిసేయుదు. యెట్లు లీ దుఃఖసాగరంబును దాటుదు. యేమియూ దోచదయ్యె.

లక్ష్మ:—అన్నా!

తే॥ గీ॥ మీరలెఱుఁగని దేదైన వేరె గలదె
శివునికైనను, సరసిజ భవునికైన
వాసవునికైన నొకటి వానికైన
కర్మఫలమును తప్పింప గా వశంబె।

మన మిటనుండి జాగుసేయఁదగదు. సత్వరమే, సీతాన్వేషణమునకై బయలుదేరవలయు.

శ్రీరా:—కానిమ్ము! కానున్నది కాకమానదు. పోవుదమురమ్ము.
(విచారముతో నిష్క్రమింతురు.)
(అవనిక జారును)

## ద్వితీయ రంగము—అరణ్యము.

(జటాయువు పడియున్న ప్రదేశమునకు
రామ లక్ష్మణులు వచ్చి చేరుదురు.)

జటాయువు:—(రామ లక్ష్మణులను జూచి) శ్రీరామా! లోకాభిరామా! పాహిమాం. పాహిమాం. దురాత్ముండైన రావణుండు, సీతామాత నపహరించి, దక్షిణాభిముఖుండై పోవుచుండ, నే వానితో సమరం బొనర్ప వాడు నా పక్షంబులఁ దెగవేసె. ప్రాణమాత్రావశిష్టుడనై, తమ కీ వృత్తాంతంబు దెలుప తమరాకకై నిరీక్షింపుచుంటి. తమదర్శనభాగ్యంబుచే నే ధన్యుడనైతి. అబ్బా! శ్రీరామా! బాధ యతిశయించు

చుండె. ఇంక నా ప్రాణంబులే నిలుపజాల. హా ! రామా! రామా ! రామా ! ( అని ప్రాణములువదలును ).

**శ్రీరాముడు:—** ఆహా ! నాయందుగల భక్తిచే నీపక్షిరాజ మెంతటి సాహసకార్యం బొనరించె. (దుఃఖించును) సోదరా ! తొలుత నీ జటాయువున కగ్నిసంస్కారంబు గావించి, పిమ్మట జానకి జాడ నరయుదము.

(శ్రీరాముడు జటాయువున కగ్నిసంస్కారంబు గావించును.)
(ఇరువురు నిష్క్రమింతురు)

(అవనిక జారును.)

తృతీయ రంగము.

(ఋష్యమూకపర్వతమందు, సుగ్రీవుఁ డాంజనేయాదులతోఁ గూడియుండును.)

**సుగ్రీవుడు:—**(రామలక్ష్మణులను దూరమున జూచి) మారుతీ ! ముని వేషధారులై, మహాతేజోవంతులరగు నా యువకుల గాంచితివే! (వారల జూపుచు)

ఉ॥ అల్లదె! గాంచుమోయి యట నామునిరూపవయస్కు లిర్వురున్
మెల్లగ వచ్చుచుండి రిటు మిక్కిలి డస్సినయట్లుదోచు నా
యుల్లములోన నూహలవి యుద్భవమయ్యెడు వారి గాంచగన్
చల్లగఁబోయి వారికథ సాంతము గన్గొని రమ్ము మారుతీ॥

**ఆంజనేయుడు:—** చిత్తము.

(అందరు నిష్క్రమింతురు.)
(అవనిక జారును.)

చతుర్థ రంగము.

( పంపా సరోవరముచెంత శ్రీరామ లక్ష్మణులు కూర్చునియుందురు )

**శ్రీరాముడు:—** ( విచారముతో .) లక్ష్మణా ! ఆ దానవాధముండు

జానకి నేమిచేసెనో, యెచటకేగెనో యించుకంత యేమూ దెలియరాదయ్యానే ఆహా! ఇంక నా జానకివృత్తాంతంబరయు టెట్లు ?

( ఆంజనేయుండుప్రవేశించిరామలక్ష్మణులకునమస్కరించును ).

శ్రీరా:— శుభంబగుగాక. ( అనిదీవించి ) మీరెవ్వరు ? యేకతంబున నిటకరుదెంచితిరి ?

ఆంజనేయుండు:— దేవా ! నేను సూర్య నందనుండగు సుగ్రీవుని మంత్రిని ఆంజనేయుండనువాడ. ఆభానుసందనుండు తమ వృత్తాంతంబరసిరా నన్నిటుఁ బంపియుండె.

పాట 9

ఉ॥ ధారుణి గాంచ మిమ్ములను ॥ ధన్యత నొందెను మానసంబుభూ
భారము దీర్ప నీ ధరణి ॥ భాసిలు చుండిన నెల్పువర్యులో
వే రెవరో కనుంగొనగ ॥ వేగమె నన్నిటుఁబంపె మాప్రభుం
డీరమణీయ మూర్తులిటు ॥ లే లఁజరింపగ కాననంబులన్

శ్రీరా:— ఆంజనేయా ! మేము సాకేత పురాధీశుండగు దశరథ రాజేంద్రుని పుత్రులము.

ఉ॥ రాముఁడ నేను నన్నుఁగడు ॥ రాగము మీరగఁగొల్చునీతడే
మామకసోదరుండు మది ॥ మన్నన తోడుత దండ్రి యానతిన్
భూమిజ తోడఁగ్రుమ్మరుచు ॥ బ్రొద్దులు బుచ్చుచు నుండనింతలో
భామనుగోలుపోవ బహు ॥ భంగుల చింతిలు చుంటిమియ్యెడన్.
నాసతీరత్నమగు జానకిని దురాత్ముండైన రావణుండపహరించి దక్షిణాభిముఖుండై బోయెనని జటాయువువలన విని తదన్వేషణార్థమై యిట్లు బయలువెడలితిమి.

ఆంజ:— దేవా! అదిసత్యంబే'

ఉ॥ ఆయమ భూషణా వళుల ॥ నంబరవీధిని యేగుచుండియున్
మాపైవైచి పోవగను ॥ మాప్రభు వంతట దాచియుంచె,మీ

రాయెడ కీడు దెంచి కన కానను మహాత్మ సమస్త వస్తువుల
యీయెడ జాగుసేయకయె యేగుద మిప్పుడె రమ్ము రాఘవా

శ్రీరా:— పాట 10

మీ ప్రభువైన సుగ్రీవుం డెందున్నవాడు ?

ఆంజ:—

ఉ॥ భూమిజనాథ ! గాంచుమదె భూధరరాజము ఋష్యమూకమున్
భామను రాజ్యమున్ గొనియు భ్రాత మహాబలవంతుడౌట, తా
నేమి యశక్తుడౌట, వసి యుంపగ వీలునులేక పాఱి శ్రీ
రామ ! పురంబువీడి యట రక్షణబొందెడు భానుపుత్రుడున్॥

మేమునూ ప్రభువును వెంబడించి యచ్చటనే కాలంబు గడపు చుంటిమి. సత్వరంబచ్చటికి విచ్చేయ మిమ్ములను ప్రార్థించు చున్నవాడ.

శ్రీరా:—మంచిది పోవుదము రమ్ము.

(అందరు నిష్క్రమింతురు.)

(అవనిక జారును.

పంచమ రంగము

(ఋష్యమూకపర్వతముపై సుగ్రీవుడు కొందరువానరులుకనుపించెదరు.)

(రామలక్ష్మణులు ఆంజనేయుడు ప్రవేశింతురు
సుగ్రీవుడాదిగాగల వానరులు లేచి నమస్కరింతురు.)

శ్రీరా:—శుభంబగుగాక ! (అని దీవించును.)

ఆంజ:—రాజేంద్రా ! వీరు మహానుభావులు. సూర్యవంశజులు. అయోధ్యాధీశుండగు, దశరథరాజేంద్రుని కుమారులు. రామలక్ష్మణులనువారు. పితృవాక్యపరిపాలనార్థంబై, కాననంబున వసించు చున్నతరి క్రూరుండైన రావణుండు శ్రీరామచంద్రుని సతియగు జానకీదేవి నపహరించి దక్షిణాభిముఖుండై పోయెనట. తద న్వేషణార్థమై యిట్లు బయలువెడలిరి.

సుగ్రీవుఁడు:— దేవా ! నేఁడు మీ దర్శనభాగ్యంబుచే మేము కడు ధన్యులమైతిమి.

ఉ॥ తావకదర్శనంబునను ధన్యులమైతిమి నేఁడు, మీకృపన్
పావనమయ్యె నీ నగము పంకజలోచన మిమ్ము గాంచినన్
భావములోనఁ దోఁచెడిని బాధలన్నియుఁ బాయునంచు, నన్
గావగ నీవెగాక మరి గల్గరు వేరెవరింక ధాత్రిలోన్॥

(ఒక వానరునితో) నీవేగి యా భూషణంబుల గొనిరమ్ము.

(వానరుఁడు లోనికేగి నగలమూటను దెచ్చి సుగ్రీవున కిచ్చును.)

సుగ్రీ:— ( శ్రీరామునితో ) దేవా! జానకీదేవి వినువీధి నేగుచు నీసొమ్ములమూటకడవైచె. ( అని వానిని శ్రీరాము నకిచ్చును. )

శ్రీరా:— ( ఆనగలమూటను పుచ్చుకొని దుఃఖించును ).

తే॥ గీ॥ గగన వీధి నరుంగుచు కాంత! నీవు
వెంత విలపించి యుంటివో యెఱుగ నైతి
నన్ను తృణమైన బాయని యన్ను మిన్న
యెటులనోంటివైనను వీడి యిప్పుడుంటి॥

అహా ! జానకీ ! యెట్టియిక్కట్టులకు లోనై నన్ను దలచి యెంత శోకించుచుంటివో కదా ! ( దుఃఖించును. )

సుగ్రీ:— దేవా ! యూరడిల్లుడు. జానకీదేవినన్వేషింప తె వరయుదము. శ్రీరామచంద్రా ! నా మొఱాలింపవలయు. నేనునూ దుఃఖసాగరంబున మునిగియున్నవాడ. నాయగ్రజుండైన వాలియనువాఁడు యీరాజ్యంబున కధిపతి. మా యిరువురకును వైరము సంభవింప మహాబలాఢ్యుండగు నాతఁడు నారాజ్యమపహరించి, నన్ను పురంబు వెడలనడిపి, నా భార్యను తన వశమందుంచుకొని రాజ్యమేలుచుండె. అతనికి వెరచి నేనీ పర్వతంబున కాలంబు గడపుచుంటి. వానిని వధించి మీరు సతీ సమేతంబుగ రాజ్యమిప్పించి జే కూర్చిన నా సేనసంతయూ

నలుదెసలకున్ బంపి జానకీదేవిని వెదకించెద. యెట్లైననూ నామనవి సంగీకరింపవలయు (అనినమస్కరించును)

శ్రీరా:— అటులనేకానిమ్ము మీ రిరువురు సమరంబొనర్పుడు. నేను వానిని శరఘాతంబుచేగూల్చెద.

సుగ్రీ:— చిత్తము.

(అందరునిష్క్రమింతురు).

(అవనిక జారును)

షష్ఠమ రంగము.

(వాలిసుగ్రీవులు యుద్ధము చేయుచుందురు. శ్రీరాముడు చెట్టుచాటుననుండును. వాలి సుగ్రీవుని క్రిందబడవైచును. సుగ్రీవుఁడు పారిపోవును)

వాలి:—

శా॥ ఓరా! క్రూరుడ! రమ్ము రమ్మిపుడు నిన్నంతంబు నొందింపగా
శూరాగ్రేసరు డిందునిల్వ గను యో సుగ్రీవ యేమైతిరా
భీరంబుల్ వడి బల్కి పల్కి నిపుడో భీరుండ! రావేమిరా
యోరీ! ధూర్తుడ! యెందుడాగినను నిన్నుర్వీస్థలిన్ గూల్చెదన్

ఓరీ! కులద్రోహి! ఇదే యీముష్టిఘాతంబున నీయసువుల బాయజేసెద. రమ్ము. (అని వెంబడించును.)

(అవనిక జారును)

సప్తమ రంగము.

(శ్రీరాముడు, సుగ్రీవుడు ప్రవేశింతురు)

సుగ్రీవుఁడు:—దేవా! యేమట్లూరకుంటిరి?

శ్రీరా:—సుగ్రీవా!

తే॥ గీ॥ మీరలిర్వురు సమరంబుఁ జరపునపుడు
తెలియఁజాలక నిన్ను నే నిలువఁబడితి

పుష్పమాలను ధరియించి పోవలయు
యుద్ధభూమికి వానినే నుర్విగూల్తు॥

సుగ్రీ:—చిత్తము. (నిష్క్రమింతురు)

(అవనిక జారును.)

## అష్టమ రంగము.

(సుగ్రీవుఁడు కంఠమందు పుష్పమాలను ధరియించి వాలితో యుద్ధముఁ జేయుచుండును)

వాలి:—ఇదిగో ! చచ్చితివిరా (అని సుగ్రీవుని క్రిందబడవైచును)

(శ్రీరాముడు చెట్టుచాటుననుండి శరప్రయోగముచే వాలిని పడవేయును- శ్రీరాముఁడు, సుగ్రీవుఁడు వాలిచెంత కేగుదురు.)

వాలి:—(బాధపడుచు, శ్రీరామునితో) ఓయి ! నీకు రాజధర్మములు తెలియవా ! యేలయిట్లధర్మకార్యము జేసితివి ? నేను నీకేమి యపకారంబొనర్చితి !

శ్రీరా:— ఓయి! నీ వధర్మవర్తనమున సంచరించి, సోదరునిపురమునుండి వెడలగొట్టినదిఁగాక, వానిభార్యను వశపరచుకొంటివి. పరదారాపహరణంబు మహాపాతకంబు. రాజులకు దుష్టశిక్షణంబవశ్యకర్తవ్యంబు. నీవు దుష్టుఁడవుగాన నిన్ను శిక్షించితిని.

వాలి:— శ్రీరామా! మూర్ఖుండనై యిటులఁబల్కినందులకు క్షమింపుము. సుగ్రీవా! అంగదుని నీకుమారునివలె జూచుకొని రాజ్యమేలుచుండుము. ఆహా ! శ్రీరామా ! యీ బాధనింక నే సహింపజాల యీ శరంబును పెరికివేయుము.

(శ్రీరాముఁడు బాణమును పెరికివేయును. వాలి "హా! రామా! రామా! రామా!" యనిప్రాణములువదలును.)

( అవనిక జారును. )

( శ్రీరామసుగ్రీవులుముందుకు వచ్చెదరు. )

సుగ్రీ:— రామచంద్రా!

తే॥గీ॥ మీదుకృప గల్గి ముదమందె । నాదు మనము
దార సహితంబు రాజ్యంబు । జేరెనయ్య
భవ దుపకృతికి ఋణము దీ । ర్పంగ నెన్ని
జన్మముల కైన నాకింక । శక్తి యగునె॥

యిందులకు మీకు నేనెంతయు కృతజ్ఞుడ.

( అని నమస్కరించును. )

శ్రీరా:—

ఉ॥ భానుతనూజ! నీవిపుడు । భార్య యుతంబుగ రాజ్యమేలుచున్
గాన వినోద లీలలను । కాలము ద్రోయుచునుండు వేమొ,నా
మానిని మాట యేమగునొ । మానసమందున చింత పీడగా
జానకి జాడగాంచగను । సత్వరమంపుడు వానరావళిన్.

సుగ్రీ:—దేవా! యిప్పుడే తత్ప్రియత్నంబుగావించెద పోవుదమురండు.

(నిష్క్రమింతురు) (అవనిక జారును)

నవమరంగము.

సుగ్రీవుని సౌధము.

(సుగ్రీవుఁడు సుఖాసీనుడై యుండును)

సుగ్రీ:—ప్రియసఖీజనంబు నే డింతదనుక రాకుండుటకు గతంబెద్దియొ దెలియకుండె!

(తత్తరపాటుతో నొక వానరుండు ప్రవేశించి) దేవా! జోహారు.

(అని నమస్కరించును)

సుగ్రీ:—ఏమిరా వార్తలు ? సఖీజనం బరుదెంచుచుండిరా ?

వానరుడు:—దేవా ! ఉగ్రతేజుండై సౌమిత్రి యిటు కరుదెంచుచుండె. యీ సమాచారంబు దేవరవారికి విన్నవింపవచ్చితి.

(వానరుడు నిష్క్రమించును)

సుగ్రీ:—ఆహా! మోసము వాటిల్లెనే! యిపుడెయ్యది కర్తవ్యంబు?

(అని చింతించుచు ముందుకు వచ్చుచుండును)

(ఇంతలో లక్ష్మణుడు రౌద్రముతోఁ బ్రవేశించి)

పాట—11

లక్ష్మ:—ఓరీ! కృతఘ్నుడా!

ఉ॥ భామలగూడి నీ విటుల ♪ భగ్నమొనర్చితి రాము కార్యముల్
భూమిజగాంచఁగా కపులఁ ♪ బుచ్చెదనంచు వచించియుండి, నీ
రామనురాజ్యముల్ గొనియు ♪ రాజిలుచుంటివ! మర్కటాధమా!
రాముని పంపునల్ వినుము, దుర్రాత్ముడ! వచ్చితి రూపుమాప నిల్॥

ఓరీ! దుర్మతీ! నాడు మదగ్రజునితోడ దారాసహితంబుగ రాజ్యంబు నొసగ, జానకీదేవిని వెదకించి వప్పగించెదనని బాస యొనర్చి, యేలయిట్లుపేక్షించియుంటివి? తొలుత జెప్పుము. లేదేని, మదీయ బాణంబు నీప్రాణంబుల గొన (బాణమును జూపుచు) నిదే సిద్ధంబుగనుండె.

సుగ్రీ:—(లక్ష్మణుని చరణములకడ వ్రాలి) పాట—12

తే॥ గీ॥ తప్పుక్షమియింప వేడెద ♪ ధన్యచరిత!
కామినుల గూడి నే రాము ♪ కార్యమిలను
మఱచియుంటి, మహా పాప ♪ మయ్యె నిపుడె
యాలసింపక సేనాళి ♪ నంపువాడ॥

ఊర్మిళా మనోహరా! శ్రీరామచంద్రుని కార్యంబు మఱచి కృతఘ్నుండనైతి. యీ తప్పు క్షమింపుడు. నేడే వానరసేనల నలుదిశలకుఁబంపి, సీతామాతను వెదకించెద.

లక్ష్మ:—(శాంతించి) మంచిది. సత్వరం బట్లొనర్పుము.

సుగ్రీ:—చిత్తము.

(ఇరువురు నిష్క్రమింతురు)

(అవనిక జారును)

---



ఓం

# మారుతి సేవ

## తృతీయాంకము

---

ప్రథమ రంగము.

(అంగదుఁడు, జాంబవంతుఁడు, హనుమంతుఁడాదిగాఁగల వానరులతో సుగ్రీవుఁడు కొలువుదీర్చియుండును)

సుగ్రీ:—వానరులారా ! మహానుభావుండైన శ్రీరామచంద్రుని కరుణ వలన, నా కీరాజ్యప్రాప్తియు, భార్యాసంయోగంబును తిరిగి లభించెనన్న విషయంబు మీకెల్లరకుం దెలిసినదే. మన మిక జాగుసేయక శ్రీరాముని సతియైన సీతామాత వృత్తాంతం బారయవలయు గాన,

ఉ॥ వానరులార ! మీరిపుడె ♦ వాయుజతోడను సాగివేగమే
భానుకులుండు రామవిభు ♦ భార్యను జానకిజాడ గాంచగా
కాననభూములాదిగను ♦ గన్గొని యెల్లెడ, రామచంద్రుడుఁ
మానసమందు చింతవిడ ♦ మాసములోనను రండు నేర్పుమై॥

మారుతీ ! నీవు వీరలకు నాయకుండవై కార్యము సాధించి రమ్ము.

ఆంజనేయుఁడు—చిత్తము.

(అందరు నిష్క్రమింతురు)

(అవనిక జారును)

ద్వితీయ రంగము.

( ప్రవేశము:— శ్రీరాముడు - లక్ష్మణుడు. )

శ్రీరా:— సౌమిత్రీ! ఆ సుగ్రీవుండిప్పటికైన, సీతాన్వేషణంబునకై కపిసేనల బంపియుండునా?

లక్ష్మ:— పంపియేయుండునని తలంచెద.

( ఇంతలో ఆంజనేయుండు ప్రవేశించి శ్రీరామునకు నమస్కరించును. )

ఆంజ:— దేవా ! మహానుభావా! భానునందనుండు సీతాన్వేషణంబునకై నలుదిశలకేగ వానరసేనలకాజ్ఞాపించె. అందులకు నన్ను నాయకునిగానియమించె. తమ దర్శనంబు గావించి పోవ నిట్లరుదెంచితి.

తే॥ గీ॥ సూర్యనందను నాజ్ఞమై ॥ శుభము లెంచి
పయన మిప్పుడె సాగింతు ॥ పద్మనయన
తావ కాశిష ప్రాప్త వాం ॥ ఛా విశేష
మొందు మిగిలినదయ్య భూ ॥ మండలేశ॥

( అనినమస్కరించును. )

శ్రీరా:— ఆంజనేయ! నీ భక్తికి కడుసంతసించితి. యెటులయిన శ్రమకోర్చి కార్యము సాధించిరమ్ము. (విచారముతో) మఱియు, నా మాటలుగా జానకితో నిట్లు వచింపుము.

సీ॥ పరిణయంబాదిగ ॥ పడఁతిరో ! రాముండు
యేనాఁడు నిను వీడి ॥ యెఱుఁగడనుము
కాలకర్మముచేతఁ ॥ గలికిరో ! నీ విట్లు
కనరాని కడగండ్లు ॥ గంటివేనుము

జీవచ్ఛవంబుగా ౯ శ్రీరాము డిప్పుడు
యువిదరో ! ధరణిపై ౯ నుండెననుము
పతిబాసి యెన్నాళ్లు ౯ బ్రతుకుదు నేనంచు
భామరో ! జీవముల్ ౯ బాయకనుము

తే॥ గీ॥ కష్టసుఖములు జగతిలో ౯ గలుగుననుము
చింతవీడియు శాంతిని ౯ జెందుమనుము
స్వల్పకాలంబు క్షాంతిని ౯ బడయుమనుము
వేగ, రావణు ద్రుంపంగ ౯ వెడలుదనుము.

(వ్రేలియుంగరము దీసి) పాట—13

మారుతీ ! యీ యంగుళీయకం బానవాలుగ జానకి కొసంగుము. (అని యిచ్చును)

(ఆంజనేయు డాయుంగరమును కనుల నద్దుకొనును)

సమీరనందనా !

తే॥ గీ॥ శోకభారంబు నిలువెల్ల ౯ బ్రాకియుండ
చిక్కి సగమయ్యె నసురుల ౯ చెంతనుండు
నారచీరెలు ధరియించి ౯ నాతియుండు
నట్టిభామినియే సీత ౯ ఆంజనేయ ! ॥

వాయునందనా ! యెటులయినను కార్యసాధనం బొనర్పుము. నీకు శుభంబగుగాక పోయిరమ్ము.

ఆంజ:—చిత్తము. (నమస్కరించి) రామ రామ రామ సీత, రామ రామ రామ సీత (యని రామస్మరణ జేయుచు నిష్క్రమించును)

(అవనిక జారును)

(తృతీయ రంగము)

(కిష్కింధానగరమున, అంగద, జాంబవంతాదులతో
ఆంజనేయుఁడు ప్రవేశించును)

ఆంజ:—వానరులారా !

తే॥ గీ॥ కపులు నేగిరి త్రి దిశల గాంచ సీత
దడవు సేయగ మనకింక తగదుగాన
దక్షిణంబున కేగక వీక్షణంబె
మీరు పయనంబు సల్పుఁడు వీరులగుచు॥

రామ రామ రామ సీత, రామ రామ సీత (యని రామస్మరణ జేయుచు, గంతులు వేయుచు వారందఱు బయలుదేరుదురు.)

(అవనిక జారును.)

చతుర్థ రంగము

సముద్ర తీరము.

(విచారముతో, ఆంజనేయుఁడు, అంగద జాంబవంతాదులు ప్రవేశింతురు)

ఆంజ:— పాట—14.

ఆహా! యెందెందు వెదకినను, జానకీదేవి వృత్తాంతంబించుకంతయు దెలియరాదయ్యెనే. యిపుడెయ్యదికర్తవ్యంబు.

చ॥ కటకట భూమిజాత నెటఁ గాంచగజాల వృధా శ్రమంబె, యిం
కెటకును బోవువాడ మది నెద్ది యుపాయము దోచదయ్యెగా
యటవిపురంబు లాదిగని యామెను గాంచగ నేరనైతి నీ
పటుతర దుఃఖవార్త విని పాయకనిల్చున రాముప్రాణముల్॥

అంగదుడు:—వానరులారా !

తే॥ గీ॥ రాము దేవిని గానక రాముకడకు
సరుగ నెంచిన, మనవారి సర్కుజుండు
పట్టు విడువక నొకసారి మట్టుబెట్టు
తలపుడిప్పుడు కర్తవ్య ములను మీరు॥

మిత్రులారా ! యెట్టులైనను మనకుఁ జావు నిక్కంబుగాన, నా సుగ్రీవుని చేతిలోఁ జచ్చుటకన్న పవిత్రంబైన నీ సాగరంబున స్నాన మాచరించి, యన్నపానాదుల వర్జించి, యీ తీరంబున దర్భలపై శయనించి ప్రాణంబుల త్యజియింతము. యిందులకు మీ రేమనియెదరు ?

జాంబవంతుడు:—మంచిది. అటులనే ప్రాయోపవేశం బొనర్తము.

ఆంజ:—ఈ యూహ బాగుగనే యున్నది. అటులనే కానిండు.

అంగదుడు:—మిత్రులారా ! రండు, మన మీ పవిత్ర జలంబుల స్నాన మాచరించి వత్తము.

(రామస్మరణ జేయుచు, అందఱు నిష్క్రమింతురు)

(అవనిక జారును)

## ప ం చ మ ర ం గ ము.

సముద్ర తీరము.

(అందఱు స్నాన మాచరించి, రామస్మరణ జేయుచు, దర్భలతోఁ ప్రవేశించి, దర్భల నాతీరంబున బఱచి, యుత్తరదిశగా తలలుంచి వరుసగా శయనింతురు)

(జటాయు వన్నయగు సంపాతి ప్రవేశించును)

సంపాతి:—ఆహా ! దైవమాయ ! ఱెక్కలులేక ప్రాకులాడుచు నాహారమునకై మలమల మాడుచున్న నా కీనాడు భగవంతుడు సంపూర్ణాహారంబు దయచేసె. నేడు కడుపార భుజించెద.

(అని వానరుల చెంత కేగుచుండును)

అంగదుడు:—ఆహా! మనకు మరణకాలమాసన్నమైనది. యీ పక్షీంద్రుడు మనలను మ్రింగవచ్చుచుండె. రామచంద్రుని కార్యంబునెర వేర్పజాలక వ్యర్థులమై చావనుంటిమికదా! ఆహా!

పక్షిరాజమగు జటాయు వెంతటిపుణ్యాత్ముఁడోగదా! రాము కార్యార్థమై రావణునితోఁ బోరి ప్రాణంబులవీడె. మనకంతటి యదృష్టము లేకబోయెగద. (అనిచింతించుచుండును.)

సంపాతి:— (తనలో) ఆహా! చిరకాలంబునుండి దెలియని మదీయ సోదరుండగు జటాయువువృత్తాంతంబు నేను వీరివలనవినయ్యె. వీరలెవ్వరో మహానుభావులు. పోయి విచారించెద. (దగ్గరకు బోయి) (ప్రకాశముగా) అయ్యా! మీరలెవ్వరు? నాసోదరుడగు జటాయువునుగూర్చేమియో సంభాషించుచుంటిరి?

అంగ:— ఓపక్షిరాజమా! శ్రీరామచంద్రునిసతియగు జానకీదేవిని, దురాత్ముండైన రావణుండు మోసముచే నపహరించి గొని పోవుచుండ, జటాయు వదిగాంచి యాదానవాధమునితోఁ బోర, నా దశకంఠుండు జటాయువుపక్షంబులఁదెగవేసె. అంత శ్రీరాముడచ్చోటికరుదేర, నా పక్షీంద్రుండు రామునకు సీతాప హరణవార్త నెరింగించి ప్రాణంబులవీడె.

సంపాతి:— ఆహా! సోదరా! శ్రీరాము కార్యార్థమై ప్రాణంబుల నర్పించి రామబంధువైతివిగదా! నీవే కడు ధన్యుండవు. నీ యాత్మ శాంతించుగాక.

అంగ:— అంతట, శ్రీరాముండా జటాయువున కగ్నిసంస్కారంబు గావించిన పిమ్మట సుగ్రీవునితో సఖ్యం బొనరించె. రామాజ్ఞచే సుగ్రీవుండు మమ్ములను సీతాన్వేషణంబునకై పంపియుండె. యెందు వెదకినను యామె జాడయే గానని కతంబున రాము కడకు బోజాల కిటులఁ బ్రాయోపవేశం బొనర్ప నిశ్చయించు కుంటిమి. అయ్యా! సీతామాత వృత్తాంతంబు మీకేమైన దెలిసియుండిన దయచేసి సెలవిండు ?

సంపాతి:— పెక్కు వత్సరంబులనుండి దెలియని నా తమ్ముని వృత్తాంతంబు నెరింగించి పుణ్యము గట్టుకొంటిరి. అయ్యా! యా జానకీ దేవిని రావణుండు సముద్రంబు దాటించి లంకాపట్టణంబునకు

గొనిపోయె. మీలో నీ సముద్రోల్లంఘనంబుగావింప సమర్థులు గలరేని, పోయి సీతామాత వృత్తాంతం బరసిరండు. నే బోయి వచ్చెద. (సంపాతి నిష్క్రమించును)

(యీ వార్త విని, అంగదాది వానరులందరొకరి మొగము లొకరు జూచుకొనుచు విచారించుచుందురు)

ఆంజ:—మీరేల యిట్లొకరి మొగంబు లొకరు జూచు చూరకుండిరి?

అంగ:—పావనీ !

తే॥ గీ॥ ఎటుల సాధ్యంబొ దాటంగ నిట్టి జలధి
రాముదేవిని గాంచక రాము కడకు
నెటుల నేగుదమంచును యిటుల నేడు
చింత నొందుచు నుంటిమి స్వాంతములను॥

జాంబవంతుడు:—మారుతీ !

తే॥ గీ॥ యెంత యోచించిననుగాని సుంతయైన
దారి గానము మే మిట దాటను దధి
నరయ నీకెకా కన్యుల తరమె ! గాన
నాలసింపక పోయిరా యనిల తనయ॥

యీ భీకర పారావారంబును దాట మే మెల్లర మశక్తులము. అట్టి శక్తి నీకు మాత్రమే గలదు. గాన, సత్వరంబీ సాగరంబును దాటి, లంకాపురంబు జొచ్చి, సీతామాత వృత్తాంతం బరసి వచ్చి శ్రీరామచంద్రునకు ముదం బొనరింపుము.

ఆంజ:—(యించుక యాలోచించి) మిత్రులారా !

ఉ॥ భీతిలనేల మీర లిటు బీరముతో నిపు డబ్ధిదాటి, యా
పాతకుడైన రావణుని పట్టణమెల్ల గలంచి, జానకీ
మాతను గాంతు నిక్కముగ మామకరాకను జూచుచుండ మీ
రీతరినే వసింపుడు, త దేకతవత్తు మహారయంబునన్॥

నే బోయివచ్చెద. (రామస్మరణ జేయుచు నిష్క్రమించును)

(అవనిక జారును)

——(0)——



ఓం

# మారుతి సేవ

## చతుర్థాంకము

---

ప్రథమ రంగము

(ఆంజనేయుఁడు మహేంద్రపర్వతంబుపై కెక్కి, గగనమార్గంబున కెగసి, సముద్రోల్లంఘనముజేసి లంకాపురంబుజేరును)

పురద్వారము.

( లంకిణియనురాక్షసి ప్రవేశించును. )

లంకిణి:—( తనలో ) ఎవ్వడీ వానరాధముంఁడు? ( ప్రకాశముగా ) ఓరీ! నీచవానర! నేనిటఁగావిలిగాయుచుండ నిసుమంతయుభీతి లేక, నీలంకాపురంబు ప్రవేశింప నెంచితివా? నిన్నిదే పరేత లోకంబునకతిథింగావించెదగాచికొమ్ము. ( అనిహుంకరించును.)

పాట—15

ఆంజ:—ఓసీ! లంకిణి! నీకెంత కండకావరమా! శ్రీరాముకార్యార్థమై యేగుచున్న నన్నడ్డగింపవచ్చుచుంటివా!

తే॥ గీ॥ హుంకరించెదు నీదగు కింకమేను
నొక్కవ్రేటున నిప్పుడె యుక్కడంచి

యరుగువాడను రావణా – భ్యంతరమున
కసువులన భీతి గలదేని – యరుగుమవల॥

మితిమీఱి భాషింపక నోరుమూయుము. అరచితివా చచ్చితివి.

లంకిణి:—ఓరీ ! శుంఠా ! పట్టిన మలినపంక్తిక్రింద కే చాలవే ! నీ కింతటి పొగరటరా ! నీ కాయువు మూడినది రమ్ము.

(అని ఆంజనేయుని మీదికి వచ్చుచుండును)

ఆంజ:—ఓసీ ! వదరుబోత ! రమ్ము. ఇదే నీ గుండెలు వ్రక్కలు జేసి పురప్రవేశంబు గావించెద. (అని తన వాలముతో దానిని జావమోది క్రిందబడవైచును. (లంకిణి క్రిందబడి తన్నుకొనుచు బాధ నభినయించును)

లంకిణి:—అయ్యా ! కరుణించి, యాడుదాననైన నన్నింతటితో విడచి, నీ కార్యసాధనకై నిరాటంకముగాఁ బొమ్ము. నన్ను విడువుము. నా యెముక లన్నియు విరిగి చూర్ణంబయినవి. నన్ను క్షమింపుము. నాకు ప్రాణదాన మొసంగుము.

ఆంజ:—అటుల దారికి రమ్ము.

తే॥ గీ॥ బలము గలదని గర్వంబు – వలదు నీకుఁ
జేష్ట లిట్టివి మానుము – చెడెద వింకఁ
బట్టి జంపకపోదురే – మిట్టిపడిన
జాలిగలవాడ నేనాట – జంప నిన్ను॥

సరిగా సంచరింపుము. తెలిసినదా, జాగ్రత.

లంకిణి:—(భయముతో) చిత్తము. చిత్తము.

( ఆంజనేయుఁడు రామస్మరణజేయుచు నిష్క్రమించును. )

లంకిణి:—అమ్మయ్య! ప్రాణంబులుదక్కినవిగాని, భయంబింకను వదుల లేదు. ( యించుకయాలోచించి, )ఔరా! నేటితో యీలంకా పట్టణంబునకు వినాశకాలంబు సంప్రాప్తించెనని తోచెడిని.

( నిష్క్రమించును. )

( అవనిక జారును. )

## ద్వి తీ య ర ం గ ము

లంకాపట్టణమందొక వీధి

( ఆంజనేయుఁడు ప్రవేశించును )

ఆంజ:— ( విచారముతో, ) ఆహా! రావణునియంతఃపురంబునందును, పెక్కు భవనంబులందును, యుద్యానవనంబు లాదిగాఁగల నానాప్రదేశంబులం దెందు వెదకినను మా జానకీదేవిని గాంచ నైతినే! యేమి జేయునగు.

చ॥ ఎచటను మాతగానఁగద ♦ యేదియొ మాయగఁదోచె రామ! యిం
కెచటకు నేఁగువాడమతి ♦ యేదియు దారియొగానకుండె, మీ
రచట సమీరసూనుడు, ర ♦ యంబున జానకిజాడనిప్పుడే
యిచటకు దెచ్చుచుండునని ♦ యెంత ముదంబుననున్నవారలో॥

జానకీదేవిని గాంచక, శ్రీరామచంద్రుని యే మొగంబుతోఁ జూతును. యీ వార్త విని శ్రీరాము డెట్లు జీవించును. నాకెయ్యది కర్తవ్యంబు (యించుక యాలోచించి) అయినను, అల్లదే ! ఆ యశోకవనంబంను గలదేమొ పోయి చూచెదగాక. (అని రామస్మరణ జేయుచు నిష్క్రమించును)

(అవనిక జారును)

## తృ తీ య ర ం గ ము.

అశోక వనము.

(సీతాదేవి విచారముతో యశోక వృక్షముక్రిందఁ గూర్చుని యుండును.

(రాక్షస స్త్రీలు కాపుందురు)

సీత:— పాట—16

అక్కటా !

సీ॥ శ్రీరాముదేవినై ♦ చెన్నారు నే నింకఁ
బడరాని యిడుమలఁ ♦ బడగనయ్యె
మాయలేడిని గాంచి ♦ మాయ గాంచగలేక
భ్రమయింప నీవిధి ♦ ప్రాప్తమయ్యె

సౌమిత్రి, "యిది మాయ । సత్యంబు గాద"న్న
వినవందు కీగతి । గనగనయ్యె
పర్ణశాలను దాట । వలదన్న సౌమిత్రి,
మూర్ఛించినందు కీ । మోసమయ్యె
తే॥ గీ॥ నాథు దర్శనభాగ్యంబు । నాకుఁ గలదొ
లేదొ, యీ దుఃఖవారాశి । నీదు టెట్లొ
యేమిసేయుదు నక్కటా ! । యేది దిక్కు
రామ ! రమ్మ, చేకొమ్మ నీ । రామ నేఁడు॥
(దుఃఖించుచుండును)

(ఆంజనేయుఁడు మెల్లగా నా వనములోఁ బ్రవేశించును)

ఆంజ:—(తనలో) ఆహా ! నారచేలంబులు ధరియించి, శుష్కించి యున్న యీయమయే మా సీతామాత యని దోఁచెడిని. నే నిదే యీ వృక్షం బారోహించి, సమయమునకై వేచి యుండెద.

(అని, సీతాదేవి కూర్చున్న వృక్షముపై కెక్కి యామెకును, రాక్షస స్త్రీలకును దెలియకుండ కొమ్మలచాటున నక్కియుండును)

సీత:—హా ! రామ ! రామ !

సీ॥ శ్రీరాము డక్కట ! । ఘోరాటవులలోన
నేరీతి నుండెనో । యెఱుఁగ నొక్కొ
మారీచుఁ డానాఁడు । మాయను గావింప,
నడుకాన దానెంత । యడలె నొక్కొ
సౌమిత్రి నను బాసి । చనకున్న బల్కిన
కఠినోక్తులకు నెంతఁ । గనలె నొక్కొ
యెందెందు వెదకిన । నేదారి గనకున్న,
నను గాంచ నెందు తా । జనియె నొక్కొ
తే॥ గీ॥ యెట్టు లీ వార్త రామున । కెఱుక పడునొ
నాథు క్షేమంబు నేరీతి । నాకు దెలియు

శోకభారంబు భరియింప ॥ నాకుఁ దరమె
రామ! రమ్ము చేకొమ్ము నీ ॥ రామ నేడు॥
(సీత తల వంచుకొని దుఃఖించుచుండును)
(ఇంతలో రావణుఁడు ప్రవేశించును)

రావణుఁడు:—(తనలో) ఆహా! యేమి! యీ తరుణీమణి సౌందర్యంబు!

ఉ॥ మాసినచేలముఁ గలిగి ॥ మానినితానిటుగుందుచుండినన్
వాసిదొఱంగ దింతయును ॥ వారిజలోచన లెందఱున్న, నీ
భూసుత సోయగంబునకుఁ ॥ బోల్పగలే రెవరైనధాత్రిలో
నీసతిగూడి నేనిపుడె ॥ యెల్లసుఖంబుల నొందగావలెన్।

(ప్రకాశముగా) ఓ మగువా! యేలయిట్లు రామ! రామ! యని దుఃఖించెదవు. సకల దేశాధీశుండనగు నన్నుఁ జేపట్టుము. యీ త్రిభువనంబుల నన్ను జయించువాఁడెవ్వండును లేఁడు. నీవు నన్నువరించినచో, నిన్నిలంకాపట్టణంబునకు పట్టపుదేవిగా నొనర్చెద. నీకు సర్వసౌఖ్యంబులు జేకూర్చెద కాన, నోజవ్వనీ! నీ యౌవ్వనంబును రిక్తసేయక సత్వరంబు నన్నువరింపుము.

(ఆంజనేయుఁడుకోపమునభినయించును)

సీత:— (తలవంచుకొనియుండియే గడ్డిపరకను చేబూని,) ఓరీ! మూఢాత్మ! నీకుఁజెడుకాలము దాపరించి యీదుర్బుద్ధిపుట్టినది. పరదారాపహరణంబు మహాపాతకంబు. ఈ సీతాపహరణంబు నీమృత్యువునకు కారణంబు. ఇది మొదలంట నిన్నుగాల్చివైచును. నీవుబ్రతుకదలంచితివేని, నన్నుసత్వరంబు నానాథున కప్పగింపుము. లేదేని, నీవు, నీపుత్రమిత్ర కళత్రాదులు నిర్మూలమగుదురు. యీ లంకాపట్టణంబు శ్మశానంబగు. యిదంతయు లోనెంచి, నన్ను నానాథున కప్పగింపుము.

రావణుఁడు— పాట—17

ఓసీ! మదవతీ! యేమే నీ వాచాలత్వము! సకలలోక

భయంకరుండ నగు నన్ను గాంచి వెఱగందుటకుమారు, నాకే నీతులు బోధించుచుంటివా ! మంచిది. నీకు మాసద్వయంబు గడు వొసంగితి. యీలోన నీవు నన్ను వరింపవేని, (ఖడ్గంబు జూపుచు) నిన్ని కరవాలంబున కెరజేసెద.

సీత:—హా ! రామ ! రామ ! (అని మూర్ఛిల్లును)

(ఆంజనేయుఁడు క్రోధము నభినయించును)

రావణుఁడు:—(అచ్చట కాపున్న రాక్షస స్త్రీలతో) అసురాంగన లారా !

తే॥ గీ॥ నెలల రెండిచ్చినాడ మా ర్నినికి గడవు
యెట్టులైనను మీరలు ర్పట్టు విడక
యత్న మొనరించి, సీత నా ర్పత్నిగాగ
నలుపవలయు త్వదీయ వా ర్త్సల్య గరిమ॥

యీ కార్యంబును కడు నేర్పుతో సాధింపవలయు.

రాక్షసస్త్రీలు:—చిత్తము.

(రావణుడు నిష్క్రమించును)

సీత:—(మూర్ఛనుండి లేచి) పాట—18

హా ! రామ ! రామ !

ఒక రాక్షస స్త్రీ:—ఓసీ ! సీత ! యేల యిట్లు రామ ! రామ ! యని దుఃఖించెదవు. యింకెక్కడి రాముడు. రాముడు రాడు, నిన్ను జేకొనిపోడు. మా ప్రభువైన దశకంఠుని వరింపుము. నీకు యీ చెఱ వదలి, సర్వ సౌఖ్యములు జేకూరును. నా మాట వినుము. యేల చెడిపోయెదవు. (సీత తల వంచుకుని దుఃఖించుచుండును)

మఱియొక రాక్షస స్త్రీ:—యేమే ! సీత ! మొందుల కీ బెట్టు. సత్వరంబు మా మహారాజును వరించి, మా కెల్లరకును మహారాణివి కమ్మా. మా ప్రభువు నీ పాడు మొగంబును వరించెను గాని, నన్ను వరించినచో, యీ లంకాపట్టణంబునకు పట్టపు

దేవినై సర్వ సౌఖ్యంబుల ననుభవించుచు, మహారాజును నా చేతి కీలుబొమ్మను జేసివైచియుందును గదా.

సీత:—మీ రెంతైన జెప్పుడు.

క॥ పరపురుషుల నే నెన్నడు
ధరణిని గాంచంగ దలప ♦ ధర్మము దప్పన్
నిరతము శ్రీరఘురాముని
చరణములే గొలుచుచుందు ♦ శరణంబనుచున్॥

నేను పరపురుషుల గన్నెత్తియైన జూడను. హా! రామ! రామ! (అని దుఃఖించుచుండును)

(ఇంతలో త్రిజట మేల్కాంచును)

త్రిజట:—(సీతతో) అమ్మా! నీ నాథుండగు శ్రీరాముఁడు వానర సేనతో సముద్రము దాటి, లంక ప్రవేశించి, రావణుని వధించి, నిన్ను దోడ్కొని బోవునని నాకు స్వప్నంబు గల్గె. ఇంతలో మేల్కాంచితి.

సీత:—(సంతోషముతో) ఆహా! యెట్టి శుభవార్త వింటిని! రామ చంద్రా! నిన్ను గాంచు భాగ్యం బెన్నడు గల్గునో గదా! యీ నీ సతి బాధ లెన్నడు దొలంగునో గదా!

(రాక్షస స్త్రీలు నిద్రించుచుందురు)

(ఆంజనేయుఁడు చెట్టుపైనుండి మెల్లగా 'రామ రామ రామ సీత, రామ రామ రామ సీత' యని రామ స్మరణ జేయుచుండును)

సీత:—(ఆశ్చర్యముతో) ఆహా! రామనామంబు విననయ్యెడి. యెచ టను చెపుమా! (అని నలుదెసలఁ బరికించి, యెందునుఁ గానక పైకిఁ జూడ నొక వానరుఁడు కనఁబడును. భయాశ్చర్యంబు లతో) ఆహా! ఇది యేమి! కలయా! దైత్యమాయయా!

మ॥ కలలో కోతినిఁ గాంచరాదనుచు వాక్కాణింతు రార్యోత్తముల్
కలయో! దైత్యుల మాయయో! నెరుగగాఁ గష్టంబు, యీనాడికే

కలుషంబంటునో, యేమిగానగునో, మరెట్లు-ంతుండు శ్రీరామునిన్
తెలుపఁ జాలెడువారు లేరెవరు హా ! ॥ దేవా! కృపఁ గావవే॥
(దుఃఖించుచుండును)

(ఆంజనేయుఁడు చెట్టుదిగి, రామస్మరణ జేయుచు, మెల్లగా సీతాదేవి సమీపమునకు వచ్చుచుండును)

సీత:—(అది రాక్షస మాయ యని దలచి, తనలో) ఔరా ! ఆ దానవాధముండు వానరరూపంబున నిట్లు సమీపించుచున్నవాఁడు కాబోలు. (ప్రకాశముగా) ఓరీ ! దుర్మతీ ! నాఁడు భిక్షుక వేషంబున మోసముచే నన్నపహరించి తెచ్చినదిగాక నేఁడు వానరరూపంబున మోసగింప వచ్చుచుంటివా !

ఉ॥ మోసముజేసి నన్ను మును ॥ ముచ్చిలి దెచ్చిన దింతఁజాల కీ
వేసముదాల్చి నీవు నను ॥ వేదన నొందగ జేయుచుంటివా
దోసమటంచు నీ మదిని ॥ దోఁచ దదేలనో, రాక్షసాధమా
నీ సతి సూత్ర మింక నిల ॥ నిల్వకొనం దలతేని, పొమ్మిఁకన్॥

ఆంజ:—అమ్మా ! నన్ను సంశయింపవలదు. నే దానవుండగాను. శ్రీరామచంద్రుని దూతను.

ఉ॥ అంజనిదేవి యాత్మజుఁడ ॥ నమ్మరో ! పేరున ఆంజనేయుఁడన్
కంజదళాక్షు రాము పద ॥ కంజము లెప్పుడుఁ గొల్తు భక్తి నీ
కంజలి మోడ్చి జెప్పెద ని ॥ దంతయు సత్యము, తల్లి ! దైత్యులన్
భంజనసేయు రాము డిటుఁ ॥ బంపఁగ వచ్చితి నమ్ము మీ కథన్॥

సీత:—అటులయిన, నా నాథుని రూపగుణ విశేషంబుల నొకింత నెరుంగఁజేసిన నమ్మగలను.

ఆంజ:—అమ్మా !

ఉ॥ శ్యామల వర్ణమున్ గలిగి ॥ చల్లని చూడ్కు-ల నెల్లవారలన్
ప్రేముడి మీఱఁబ్రోచు మతి ॥ పెద్దల గాంచి నమస్కృతుల్ సదా
నీమముతోడ సల్పు మహ ॥ నీయుడు రాముఁడు లోకరక్షకుం
డీమహి ధర్మమున్నిలుప ॥ నిట్టుల దా జనియించె మర్త్యుఁడై॥

మఱియు,

సీ॥ మత్స్యమై సోమకు । మద మడంచిన ఘనుం
డాదిదేవుడుగాదె । నీదు ధవుడు
కూర్మమై వేల్పుల । గోర్కె దీర్చినయట్టి
రాజీవనేత్రుడే । రామవిభుఁడు
సూకరాకృతి దాల్చి । శోకించు భూదేవి
తాపమార్చినవాడె । తాటకారి
నరసింహమూర్తియై । ధరలోన ప్రహ్లాదు
గాచినవాడె రా । ఘవుడు ఘనుడు
తే॥ గీ॥ వామనాకృతితో బలి । వంచె వాడె
ధాత్రి భార్గవరాముడై । ధరణిపతుల
జంచి చెండాడె, వాడె పం । క్తిరథు పట్టి
రఘుకులాన్వయమూర్తి శ్రీ । రామమూర్తి॥

తల్లీ !

తే॥ గీ॥ అనుజుతోడను శ్రీరాము । డడవులందు
నారచీరలు ధరియించి । నాతి కొఱకు
ఖేద మొందుచు నొక్కచో । కీశనాథుఁ
డర్కజు చెలిమి జేసి న । న్నంపె నిటకు॥

అమ్మా ! మా ప్రభువైన సుగ్రీవునకు మహా బలాఢ్యుండగు వాలి యను నత డగ్రజుండు. ఆతడు, తమ్ముని భార్య నపహరించి వానిని తన రాజ్యంబునుండి వెడలనడప, శ్రీరామచంద్రుడా యింద్రనందనుని వధియించి యినతనయునకు దారాసహితంబుగ రాజ్య మొసంగె. అంతట, భానుతనూజుండు, శ్రీరామచంద్రుని యాజ్ఞ మేరకు తమ యన్వేషణార్థమై వానరుల నలు దెసలకుం బంపియుండె. అందులకు నన్ను నాయకునిగా నియమించె. నేను శ్రీరామచంద్రుని దర్శించి బయలువెడలితి.

ఆ దేవదేవుండు మీ కానవాలుగ నీయంగుళీయకం బొసంగిరి.
(అని యంగుళీయకమును సీతాదేవి కొసంగును)

సీత:—(అంగుళీయకమును కనుల నద్దుకొని) ఆహా !

తే॥ గీ॥ అంగుళీయకమును గాంచ ✱ నాత్మలోన
నాథు దర్శన మైనట్లె ✱ నాకుఁ దోఁచె
నెపుడు గాంతునో నిజ కాంతు ✱ నెట్లు దెలియు
జన్మలో నిట్టి భాగ్యంబు ✱ సంభవిలునె॥

మారుతీ ! నా నాథుండును, నా మఱంది లక్ష్మణుండు కుశలంబుగ నున్నవారలు గదా ?

ఆంజ: —అమ్మా ! వా రిర్వురకును కుశలమే. అంతట, వారివద్ద సెలవు గైకొని, కొంత సేనను త్రి దిశలకుం బంపి, మఱికొందఱు వానరులం గలిసి, నేను దక్షిణ దిక్కునకు బయలు వెడలితి. యెందును మీ జాడ దెలియరామి చింతించుచు సముద్రతీరంబు జేరి యచ్చట ప్రాయోపవేశం బొనర్ప నిశ్చయించుకొంటిమి. ఇంతలో జటాయు వన్న యగు సంపాతి యచ్చట కరుదెంచి, జటాయువు వృత్తాంతంబు మావలన విని, మా స్థితి నంతయు నెరింగి, రావణుండు సముద్రోల్లంఘనంబు జేసి, సీతామాతను లంకాపట్టణంబునకు గొనిపోయెనని వచించె. నాతోడ నేతెంచిన వానరులీ పారావారం బెటుల దాటనగునని విచారించుచుండ, వారల నటనుండ నియమించి, నేను గగనమార్గంబున నెగసి సముద్రంబుదాటి, లంకాపుర ద్వారంబు కడకే తేర,

ఉ॥ కావలిగాయుచుం దనుజ ✱ కాంత యొకర్తట హుంకరించుచుం
బోవగ దారి నీకయును ✱ భూరిబలంబును జూపినంతనే
కావరమెల్లదీర కడు ✱ గాసిలజేసిన దానవాంగనం
కావుమటంచు నేడ్వగను ✱ కాంతనువీడి పురంబుజొచ్చితిం॥

పిమ్మట, రావణుని యంతఃపురంబాదిగాగల సకలభవనం బులు, యుద్యాన వనంబులు, నానాప్రదేశంబులును వెదకి వెదకి, యెంతను మీజాడ దెలియక చింతించుచు, నీవనంబు గూడ గాంచి పోవుదమని, యిందుజేరి చూడ మీరు గాన్పించితిరి——అంత

శా॥ శ్రీరామునకు వచించినట్టి విధముల్ ♦ శీఘ్రంబె గన్పట్టగా
మీరే రాముని దేవియంచు తరుపై ♦ మెల్లంగ నే జేరి, యా
క్రూరాత్ముం డు వచించు పల్కు విన గ ♦ క్రోధంబు బో పెక్కు నన్.
వీరావేశముమాని నే, తరుణముల్ ♦ వీక్షించి యేతెంచితిన్॥

మీదర్శనభాగ్యంబుచే, నేను ధన్యుండనైతి. మీ క్షేమ వార్త శ్రీరామచంద్రునకు సత్వరంబు దెలుప నామనంబు తత్తరబడుచు న్నది. వారికీవృత్తాంతంబు దెలుప, నా దేవదేవుండు, రావణుని సంహరించి, మిమ్ములనిప్పుడే గొనిపోగలడు అమ్మా! అంతయేల!

క॥ తల్లీ ! రండిక, వీపున
నుల్లాసము మీరగొనియు ♦ నుదధి గడచియున్
ముల్లోకంబులు బొగడగ,
దల్లీ ! విడతును పతికడ ♦ దడవిక నేలన్॥

సీత:——మారుతి ! యింతసూక్ష్మరూపుండవు నీవు నన్నెట్లుగొని పోగలవు ?

ఉ॥ మారుతి! చోద్యమయ్యె గద ♦ మాటలకింతటి సూక్ష్మరూపి వీ
భారపుకార్య మేపగిది ♦ భావమునందు దలంచి తో, మహా
ఘోరవికార రూపులగు ♦ క్రూరులు దానవులన్ జయింపగా
వీరలకేది గష్టమగు ♦ వెట్టి తలంపును మానుమింతటన్॥

ఆంజ:——అమ్మా ! అట్లు సందేహింపవలదు. ఇదే నాస్థూలదేహంబును గనుంగొనుడు. ( అని, రామస్మరణ జేయును. )

# విశ్వరూపప్రదర్శనము.

సీత:—( ఆశ్చర్యముతో ) ఆహా ! సూక్ష్మరూపుండింతలో నీ ఘోరాకారం బెట్లుదాల్చె ? మారుతి !

తే॥ గీ॥ తెలియ జాలక నీ శక్తి ∫ బలికి తటులఁ
దెల్లమయ్యెను నాకు నీ ∫ దివ్య దేహ
మిపుడు, గాంచగఁ జాల యే ∫ నిట్టి మేను
విశ్వరూపంబుఁ జాలించి ∫ వెడలిరమ్ము॥

ఆంజ:-(ఉపసంహరించి, రామస్మరణ చేయుచు, సీతాదేవికినమస్కరించును.

సీత:—మారుతీ !

తే॥ గీ॥ రామదూత కసాధ్యమా ! ∫ రామభక్త !
యరయ నాఘుగా కన్యుల ∫ నంట నేను
యఖిల శుభములు నీకగు ∫ ననిలతనయ !
ధర, చిరంజీవి వగుచును ∫ దనరుమయ్య॥

ఇంక మన్నాథుండేమి వచించె ? యా వృత్తాంతంబు విన మనంబు వేగిరపడుచుండె.

ఆంజ:—అమ్మా ! మీతో నిట్లు వచింపుమనిరి.

సీ॥ పరిణయంబాదిగ ∫ పడఁతిరో ! రాముండు
యేనాడు నిను వీడి ∫ యెఱుగఁడనుము
కాలకర్మముచేతఁ ∫ గలికిరో ! నీ విట్లు
కసరాని కడగండ్లఁ ∫ గంటి వనుము
జీవచ్ఛవంబుగా ∫ శ్రీరాముఁ డిప్పుడు
యువిదరో ! ధరణిపై ∫ నుండె ననుము
పతిబాసి యెన్నాళ్ళు ∫ బ్రతుకుదు నేనంచు
భామరో ! జీవముల్ ∫ బాయకనుము

తే॥ గీ॥ కష్టసుఖములు జగతిలో ∫ గలుగు ననుము
చింత వీడియు శాంతిని ∫ జెందు మనుము

స్వల్పకాలంబు శాంతిని ౯ బడయు మనుము
వేగ, రావణు ద్రుంపంగ ౯ వెడలు దనుము॥
(సీత దుఃఖించును)

తల్లీ ! మీ వృత్తాంతంబా శ్రీరామచంద్రునకు సత్వరంబెరుంగ జేయవలయుగాన నా కిక సెల వొసంగ వేడెద.

సీత:—పావనీ ! నా నాథునితో నిట్లు వచింపుము.

తే॥ గీ॥ రెండు నెల లట దశకంఠు ౯ గడువు యనుము
కరుణ రాముని రమ్మంటిఁ ౯ గావ ననుము
యన్నదమ్ముల నిరువుర ౯ నడిగి తనుము
గడవు మీాఱిన జానకి ౯ గడచు ననుము॥

వెండియు, నా మఱంది లక్ష్మణునితో,

తే॥ గీ॥ మాతృభక్తిని నాయందు ౯ మరువఁ డెపుడు
యన్న యానతి మీాఱని ౯ యనఘుఁ డతఁడు
యట్టి మఱఁదిని కఠినోక్తు ౯ లాడినట్టి
పాపఫలమును గనితంచు ౯ బలుకుమయ్య॥
( కొంగున ముడివైచిన చూడామణిని దీసి ) ఇదిగో ! యీా రత్నంబు నానవాలుగఁ గొనిపొమ్ము. (అని యిచ్చును. ఆంజనేయుఁడు పుచ్చుకొని కనుల నద్దుకొనును)

సీత:—నీకు శుభంబగుగాక పోయిరమ్ము.

ఆంజ:—అమ్మా !

ఉ॥ ఆకలిబాధ యెక్కువయె ౯ నక్కట ! యోర్వగజాలనైతిగా
యాకసమంటుచుండు ఫలము ౯ లల్లదె ! గానగవచ్చె నమ్మరో !
నాకును జూడగా దనుజ ౯ నాథు వనంబని గోచరించెడుఁ
యాకలి నాపజాల, నిడు ౯ డాజ్ఞను పండొక టారగింపగ॥

గీడొనర్చెదరేము, జాగరూకుండవై మెలంగుము. నీకు జయ
మగుగాక. పోయిరమ్ము.
(ఆంజనేయుఁడు సీతామాతకు నమస్కరించి, రామస్మరణ
జేయుచు నిష్క్రమించును)
(అవనిక జారును)

చతుర్థరంగము.

ఉద్యానవనము.

(ఆంజనేయుఁడు వనమందు బ్రవేశించి, రామస్మరణ జేయుచు, కాయల గోసిమైచియు, కొమ్మలను విఱచియు, వృక్షంబుల బెరకియు నానాభంగుల నాశముజేయుచుండును.)
(కావలివాడు ప్రవేశించును)

కావలివాడు:— ఓరీ ! మర్కటాధమా ! నీ వెందుండి వచ్చితివిరా ?
(అని కొట్టబోవును)
(ఆంజనేయు డొక చెట్టుఁ బెరికి వానిని మోదును. వాడు పాఱిపోయి, కొందఱు భటులతో బ్రవేశించును)

భటులు:— ఈ వానరాధముని బట్టుడు, కొట్టుడు. (అని వెంబడింతురు. ఆంజనేయుఁడు చెట్లు బెరికి వారల జావమోదును. కొందఱు హతులగుదురు. కొందఱు పాఱిపోవుదురు)

(పిమ్మట అక్షయకుమారుడు ప్రవేశించును)

అక్ష:— ఓరీ ! వానరాధమా ! ఆవంతయు మనంబున భీతిలేక నిమ్మాడ్కి నీ వనమంతయు ధ్వంసంబుగావించుచున్న ని న్నిప్పుడే మదీయ కరవాలంబున కెరజేసెద గాచికొమ్ము.

ఆంజ:— యెవరు వీరు ? ఓహో ! అక్షయకుమారులా ! మంచిది. ఇంతకుముందు తమ మిత్రులు కొందఱు నాచే బరేతలోకంబున కంపబడిరి. తమకు వారల సత్వరంబు గలసికొనఁ గోర్కె కల

దేని; యిచ్చట నిలువుడు. అట్టి వాంఛ లేదేని, వచ్చినదారిని మరలుడు.

అక్ష:— పాట—19

ఓరీ ! దుర్మతీ !

తే॥ గీ॥ కండకావరమున నీవు \ దుండగీడ
పేలుచుంటివి గాన నీ \ నాలు కిపుడె
జీల్చివైచియు, బంపెద \ శీఘ్రముగను
శమనపురమును జూడంగ \ జగతి వీడి॥

ఆంజ:—అబ్బో ! భయమగుచున్నదే! ........ఓరీ! దానవాధమా!

ఉ॥ బీరములాడనేల నిదె \ పీచ మడంచెద గాచికొమ్మికన్
వీరులు కొంద రీవరకె \ వీడిరి ధారుణి, నీవు వారినిన్
జేరగ నెంచెదేని దయ \ జెచ్చెరఁ బంపెద రమ్ము రమ్మికన్
పౌరుషశూన్యుడేని, జను \ ప్రాణము దక్కగ నింటిదారినిన్॥

అక్ష:—కారులు ప్రేలక, మగంటిమిగలదేని, యుద్ధమునకు గడంగుము.

ఆంజ:—అటులనా ! సిద్ధముగనుండుము. మదీయాయుధంబుల గైకొని వచ్చెద. (అని లోని కేగి రెండు చేతులతో రెండు వృక్షము లనుబట్టుకొని, రామస్మరణ జేయుచుఁ బ్రవేశించి, అక్షయ కుమారునితో యుద్ధముఁ జేసి వానిని గూల్చును. హతశేషు లగు భటులు పాఱిపోవుదురు. ఆంజనేయుడు రామస్మరణ జేయుచు నిష్క్రమించును)

(అవనిక జారును)

## పంచమ రంగము.

### వ న ము.

(ఆంజనేయుఁడు రామస్మరణ జేయుచు వనములో బ్రవేశించి వన మంతయు ధ్వంసము జేయుచుండును)

(కొందఱు భటులతో ఇంద్రజిత్తు ప్రవేశించును)

ఇంద్రజిత్తు:—ఓరీ ! మర్కటాధమా !

పాట—20

ఉ॥ మానసమందు భీతిలక మాపురి జేరిన దంతెగాక, యో
వానర ! యీ వనంబునకు వచ్చిన వీరుల ద్రుంచితంట, యా
రా ! నిను, మేఘనాథుడిక రాక్షసనాథుని చెంత జేర్పగా
మానడు, గాచికొమ్మదిగొ! మర్కట! యస్త్రము నిల్వుమచ్చటన్॥

(అని బ్రహ్మాస్త్రము వేయును-ఆంజనేయుఁడు కట్టుబడును)

ఇంద్రజిత్తు:—(భటులతో) భటులారా ! వీనిని గొనిపోయి మదీయ జనకున కప్పగింపుడు.

(భటులు హనుమంతుని గొనిపోవుదురు - ఇంద్రజిత్తు నిష్క్రమించును)

(అవనిక జారును)



ఓం

# మారుతి సేవ

## పంచమాంకము

---

ప్రథమ రంగము.

రావణుని దర్బారు.

(ప్రవేశము:- రావణుఁడు, విభీషణుఁడు, మంత్రులు, భటులు)

రావణుడు:—అమాత్యవర్యా ! మన వనంబంతయు నాశం బొనరించుచున్న నా మర్కటాధముని వృత్తాంతం బేమయ్యె ?

మంత్రి:—దేవా ! మన మేఘనాథుండు వానిని బ్రహ్మాస్త్రబద్ధునిఁ గావించి, తమ యొద్దకు గొనిరా భటుల కాజ్ఞాపించెనని యిప్పుడే వార్త వచ్చియుండె.

(ఇంతలో, రాక్షసభటులు బ్రహ్మాస్త్ర బద్ధుండైన హనుమంతుని గొనివచ్చి రావణుని యెదుట నిలువబెట్టుదురు. హనుమంతుని బంధనములు విడిపోవును. హనుమంతుడు తోకను బెంచి యున్న తాసన మధిష్ఠించును.)

రావణుడు:—

శా॥ ఓరీ ! దుష్కర మర్కటాధముఁడ ! నీ ॥ యూరేది ? పేరేదిరా?
పారావారగభీరు నన్ దెలియవో ॥ పాపాత్మ ! యేరీతి, మా
యారామంబును జేరితో యిపుడు నీ ॥ వావంతయున్ దాచకన్
నేరంబంత నెఱుంగజేయవయినన్ ॥ నీ కంఠమున్ ద్రుంచెదన్॥
సత్వరంబు దెల్పుము ?

ఆంజ:—ఓరీ ! రావణ ! నేను శ్రీరామచంద్రుని దూతను. ఆంజనేయుం డనువాడ. ఆ దేవదేవుని సతియైన మా సీతామాతను మోసముచే నీవు ముచ్చిలి దెచ్చిన వార్త దెలిసి, నీకు నీతి గరపనిట కరుదెంచితి. నీవు బుద్ధిగల్గి యిప్పటికైన—

క॥ శ్రీరాముని దేవి గొనుచు
నా రాముని కొసగి మఱియు ॥ నతి దీనతతోన్
యో ! రావణ ! శరణనుచును
మా రాముని వేడ నతడు ॥ మన్నించు నినున్॥

లేదేని, నీవు, నీ పుత్రమిత్ర కళత్రాదులతో నాశం బొందెదవు. యీ లంకాపట్టణంబు శ్మశానంబగు. ఇది నిశ్చయము. ముమ్మాటికి నిశ్చయము.

రావణుడు:— పాట—21

శా॥ ఔరా ! కాఱులు ప్రేలజొచ్చితివి నీ ॥ వావంతయున్ భీతిలే
కోరీ ! వానర! జూడు మీ క్షణమె నీ ॥ యూరుల్ వడిన్ జీల్చె దీ
శూరాగ్రేసరు నేరుగాఁ దలఁచితో ॥ సుస్థైన యోజింప వీ
వేరా! రాముఁడో గీముఁడో యిపుడు నీ॥ కేరీ యిటన్ గావఁగన్॥
(అని కత్తి నెత్తును)

విభీషణుఁడు:—(వారించి) అన్నా ! దూతయై వచ్చిన వానిని జంపుటధర్మము.

తే॥ గీ॥ దూత నునుముట మనకె పా ॥ దోస మగును
గాన, వీనిని జంపుటల్ ॥ మాని వైచి

ధర్మపద్ధతి దీనికిఁ । దగిన శిక్ష
మీరు విధియించి పంపుడీ । మేదినీశ॥

రావణుడు:—మంచిది. (భటులతో) భటులారా !

తే॥ గీ॥ వానరులకును ముఖ్యంబు । వాలమౌద్రు
గనుక నీ కోతి నిప్పుడె । గొనుచు మీరు
వాలమున కగ్ని దగిలించి । మేలమాడి
వీధివీధులఁ ద్రిప్పుడీ । వేడుకలర॥

పొండు.

భటులు:—చిత్తము. (అని హనుమంతుని గొనిపోయెదరు)

(అందరు నిష్క్రమింతురు)

(అవనిక జారును)

## ద్వి తీ య ర ం గ ము.

### అశోక వనము.

(అశోకవృక్షము క్రింద సీత, త్రిజట కూర్చునియుందురు)

సీత:—ఆహా ! యెట్టి వైపరీత్యము సంభవించె ! హా ! రామ !

తే॥ గీ॥ పాపభీతియె లేకను । భావమందు
రామభక్తుని వాలంబు । రావణుండు
యగ్నిదేవుని పాల్జేసె । ననుచు వినగ
భయము గొల్పెడి నా మది । ప్రాణనాథ॥

ఏమిజేయనగు ? అయిన నిట్లు వేడెదగాక.

పాట:—22

తే॥ గీ॥ ఏను సాధ్వినా టిల సత్య । మేని, యెపుడు
నాథు పదసేవ మరువని । నాతినేని
హవ్యవాహనుఁ డెంతయు । హాయి గూర్చి
వాయుసుతునకు ముదమును । జేయుగాత॥

(అవనిక జారును)

## తృతీయరంగము.

## లంకాపట్టణము.

(కాలుచున్న వాలంబుతో మారుతి ప్రవేశించును)

ఆంజ:—(అగ్నిదేవుండు తన యెడల శీతలుం డగుట నెఱింగి) ఆహా! యేమిా యద్భుతము!

చ॥ అనలము నేఁడు నా యొడల ♩ నంట దిదేమియొ గాంచ చిత్రమా!
(యించుక యాలోచించి)
జనని, మహా పతివ్రతయు ♩ జానకి మాయ యటంచు రూఢిగా
మనమున నెంచియుంటి గద ♩ మాట లిఁకేటికి జాగుసేయ కీ
యనిల సుతుండు, యీ పురిని ♩ నగ్నిమయంబుగఁ జేసివచ్చెదన్॥
(రామస్మరణఁ జేయుచు, పైకెగసి విభీషణుని గృహంబుఁ దప్ప, లంకాపట్టణ మంతయు దహనంబు గావించును. రాక్షసులు గోలబెట్టుచు, వారి వారి గృహంబులను వదలి పాఱిపోవుచుందురు)

(అవనిక జారును)

## చతుర్థరంగము.

(అశోకవృక్షము క్రింద సీత కూర్చుని యుండును)

సీత:—ఆహా! అనిల సుతుని వృత్తాంతం బించుకంతయు దెలియ రాదయ్యెనే.

ఉ॥ మారుతి రాఁడు, దానవులు ♩ మాయ నెయొనర్చియు నేమిజేసిరో
క్రూరుల బాధ కెంత మది ♩ గుందుచు నుండెనో, యెందు నేగెనో
యే రిట దెల్పువా రకట! ♩ యెద్దియు దోఁచ దికెందు గాంచినన్
శ్రీరఘురాముడే గలడు ♩ చెచ్చెరఁ బ్రోవ సమీరనందనున్॥

తెరలో, రామ రామ రామ సీత యని రామస్మరణ వినఁబడును

సీత:—అదిగో ! మారుతి రామస్మరణఁ జేయుచు నిట కరుదెంచు చుండెనని తోఁచెడిని.

(ఆంజనేయుడు రామస్మరణ జేయుచు ప్రవేశించి సీతకు నమస్కరించును)

సీత:—మారుతీ ! దుర్మదాంధులగు దానవుల బారినుండి యెట్లు రాగల్గితివి ?

ఆంజ:—అమ్మా ! మీ కృపచే నా కనలుండు శీతలుండై తోఁచె.

తే॥ గీ॥ తమదు కృపగల్గ నేను సంతసముతోడ
దగ్ధమొనరించి తీ పురి తల్లి ! యిపుడు
మిమ్ము దర్శింప నెంచియు నెమ్మనమున
వచ్చియుంటిని తల్లి ! దీవనల నిడుము॥

సీత:—మంచిది నీకు శుభంబగుగాక. పోయిరమ్ము.

(ఆంజనేయుఁడు సీతాదేవికి నమస్కరించి, రామస్మరణఁ జేయుచు నిష్క్రమించును)

పంచమరంగము.

సముద్రతీరము.

(ఆంజనేయుండు రామస్మరణఁ జేయుచు, సముద్రోల్లంఘనముఁ జేసి మహేంద్రపర్వతంబుఁ జేరి అంగదాది వానరులనుఁ గలసికొనును.)

అంగదుడు:—(ఆతురతతో) మారుతీ ! సీతామాత వృత్తాంతం బరసి వచ్చితివా ?

ఆంజ:—అహా ! యరసివచ్చితి.

క॥ ధారుణి మన మెన్ని విధము
లారయ యత్నంబు సలుప నంతయు వమ్మౌ
శ్రీరఘురాముని కృపచే
భారము లెల్లను దొలంగి ఫలములు గల్గెన్॥

(వానరు లందఱు సంతోషముతో రామస్మరణఁ జేయుచు గంతులు వేయుదురు)

అంగ:—పావనీ ! లంకాపుర వృత్తాంతం బెరింగింపుము ?

ఆంజ:—తరువాత నెరింగించెద. మనరాకకై నిరీక్షించుచుండు శ్రీరామ చంద్రుని మనము సత్వరంబు గలసికొనవలయు. పోదము రండు. (అందఱు సంతోషముతో రామస్మరణఁ జేయుచు, గంతులు వేయుచు నిష్క్రమింతురు)

(అవనిక జారును)

షష్ఠమ రంగము.

సుగ్రీవుని మధువనము.

(అంగదుఁడు, జాంబవంతుఁడు, హనుమంతుఁడాదిగాగల వానరు లందఱు సంతోషముతో రామస్మరణఁ జేయుచు, మధువనము బ్రవేశించి, వలయునన్ని ఫలముల నారగించి, మధువును గ్రోలిన పిమ్మట, కొన్ని కాయలను గోసిపైచియు, కొమ్మలను విరచియు, చిగుళ్ళను ద్రుంచియు, పుష్పంబులఁ గోసియు, చెట్ల నుండి దుముకుచు, గంతులు వేయుచు నానాభంగుల నా వన మంతయు నాశం బొనరించుచుందురు.)

(కావలివారు ప్రవేశింతురు)

(ఒకడు తన మిత్రులతో) రండు, వీరల నిప్పుడే బంధించి దధి ముఖుని పాలికిం గొనిపోదము.

మరియొకడు:—ఓ ! వానరులారా ! నిలువుడు, నిలువుడు. మిమ్ముల నిపుడే గొనిపోయి దధిముఖున కప్పగించెద. (అని బెదరించును)

(అది గాంచి, అంగదుడు వానరులతో) మిత్రులారా !

తే॥ గీ॥ వెఱువ కెంతయు మీఱలు ? వీరి కిపుడు
యిచ్చవచ్చిన రీతిని ? యీ వనంబుఁ

దిరిగి తిరిగియు ఫలముల ఁ దినుచునుండి
యడ్డగించిన వారల ఁ నణఁచుఁడయ్య॥

(అందఱు రామస్మరణఁ జేయుచు కావలివారలను చెట్లకొమ్మ లతో మోది బాధింతురు. కావలివారు పాఱిపోవుదురు. అంగదాది వానరులు వెనుకటిరీతిని వనమంతయు పాడుచేయుచుందురు. అంతట, వనపాలకుఁడైన దధిముఖుఁ డనుచరులతో బ్రవేశించును)

దధిముఖుడు:—(రౌద్రముతో) వానరులారా! యియ్యది వనచరేంద్రుండైన సుగ్రీవుని వనంబని యెఱింగియు భయ మావంతయు లేక, యేల యీలీల ధ్వంసంబు గావించుచుండిరి? కావలివాండ్ర నేల బాధించిరి? మీ రిటనుండి సత్వరంబు మఱలుడు. లేదేని, మిమ్ముల నిపుడే గొనిపోయి కీశనాథున కప్పగించెద. జాగుసేయక శీఘ్రంబు మఱలుడు. (అని బెదరించి, కొందఱు వానరులను కొట్టుచు తరిమివేయును)

అంగదుడు:—(అది జూచి రౌద్రముతో) ఒరీ! దుర్మతీ! ఏమిరా, నీ కండకావరము! రమ్ము-నీ కాయువు మూడినది. (అని రామస్మరణఁ జేయుచు, చెట్లకొమ్మలతో దధిముఖుని మోది క్రిందబడవేయును. దధిముఖుడు కొంతవడికి లేచి, బాధపడుచు మెల్లఁగా బాఱిపోవును)

(అందఱు నిష్క్రమింతురు)

(అవనిక జారును)

సప్తమ రంగము.

కిష్కింధాపురము.

(ప్రవేశము: రాముడు, లక్ష్మణుడు, సుగ్రీవుడు)

శ్రీరా:—(విచారముతో) సుగ్రీవా! పాట—23

ఉ॥ మారుతి రానికారణము ఁ మాకెటుఁ దోచకయుండె భానుజా!
ధారుణిపుత్రి గాంచగను ఁ దారియె లేకను యెచ్చటుండెనో

క్రూరుడు దానవాధముడు కో వాలి దక్కట ! యేమిచేసెనో
తీరని దుఃఖ మీపగిదిఁ దెచ్చెను దైవ మి కేమి సేయుదున్॥

సుగ్రీవుడు:—దేవా ! చింతింపకుడు. మారుతి కార్యసాధనం బొనర్చియే యుండును. సత్వరమే రాగలఁడు.

(తెరలో) దేవా ! రక్షింపుడు. రక్షింపుడు.

(అందఱు ఆతురతతో జూచుచుందురు. అంతట, బాధతో మూల్గుచు దధిముఖుఁడు ప్రవేశించి, రామ లక్ష్మణ, సుగ్రీవులకు నమస్కరించును)

సుగ్రీ:—(ఆశ్చర్యముతో) దధిముఖా ! నిన్నవ్వ రిట్లు నొవ్వజేసిరో సత్వరంబుఁ దెల్పుము ?

దధిముఖుడు:—(బాధతో) రాజేంద్రా ! అంగద, జాంబవంత, హనుమదాదులు తమ మధువనంబుఁ జొచ్చి ఫలముల నారగించి, మధువు గ్రోలినదిగాక, పుష్పంబుల గోసియు, కొమ్మల ద్రుంచి వైచియు, కాయలను రాల్చివైచియు నిల్లెలవిధంబుల వనం బంతయు ధ్వంసంబు గావించుచుండ, కావలివారు బోయి యదలింప వారలను జావమోదిరి. ఆవార్త దెలసి నేనేగి వారల బెదరించితిని. అందులకు, యువరాజలిగి నన్ను జావమోది క్రిందబడవైచె. (బాధతో) నా యెముక లన్నియు విరుగుటచే కదలమెదలలేక ప్రాణమాత్రావశిష్టుడనై తమ కీ వృత్తాంతంబు దెలుప నిట కరుదెంచితిని. (అని మూల్గుచు బాధ నభినయించును)

సుగ్రీవుడు:—(సంతోషముతో) దధిముఖా ! చింతింపకుము. వారలు జానకీదేవి వృత్తాంతం బరసివచ్చిన కతంబున బ్రహ్మానంద భరితులై యట్లొనరించియుందురు. నీ మానసంబున చింత వీడి వారల నిటకు సత్వరంబు గొనిరమ్ము.

శ్రీరాముడు, లక్ష్మణుడు:—(సంతోషము నభినయింతురు)

దధిముఖుడు:—చిత్తము. (అని నిష్క్రమించును)

సుగ్రీవుడు—(శ్రీరామునితో) దేవా ! వింటిరిగదా ! యీ వృత్తాంతంబు వలన మన మారుతి తప్పక జానకీదేవిని గాంచి వచ్చెనని రూఢియైనది. దధిముఖుండు సత్వరంబు వారల నిటకు గొనిరాగలఁడు.

శ్రీరాముడు:— భానునందన ! మధువన వృత్తాంతంబు వలన, యించుక చిత్తశాంతి గల్గినను, నా జానకి యెటుల నుండెనో, యేమనెనో సాంతముగ నెఱింగినఁగాని, నా మనంబున కూరట జనించునట్లు లేదు. (ఇంతలో రామస్మరణ వినఁబడును)

సుగ్రీ:—దేవా ! ఆలకింపుడు ! రామస్మరణ వినంబడుచుండె. హనుమదాదులు సంతోషసాగరంబున నోలలాడుచు నిట కరుదెంచుచుండిరి.

(రామలక్ష్మణులు యాతురతతో జూచుచుందురు. రామస్మరణఁ జేయుచు, అంగద, జాంబవంత, హనుమదాదులతో గలసి దధిముఖుండు ప్రవేశించును. అందఱు, రామలక్ష్మణసుగ్రీవులకు నమస్కరింతురు)

శ్రీరా:— శుభంబగుగాక ! (అనిదీవించి, ఆంజనేయునితో)

మారుతి ! జానకిని గాంచి వచ్చితివా ? ఆమె యెట్లుండెనో, యేమి వచించెనో సత్వరంబు దెలుపుమా? నామనంబు తత్తరపడుచుండె. (అని చింతించుచుండును.)

ఆంజ:— దేవా !

తే॥ గీ॥ అరసివచ్చితి భూమిజ ౯ నబ్ధిదాటి
కుశలమయ్యెడనామెకు ౯ కువలయేంద్ర!
మానసంబున ఖేదంబు ౯ మానుడయ్య
యానవాలుగ రత్నంబుఁ ౯ నంపెనిదిగో! ॥

(అని చూడామణిని శ్రీరామున కొసంగును.)

శ్రీరా:—(చూడామణిని పుచ్చుకొని విచారముతో) ఆహా! సీతాశిరో రత్నమా!

ఉ॥ మానినికీవె యెప్పుతల ౖ మానికమా చలరారుచుంటచే
మానిని నిన్నుబంపెనిటు ౖ మాకడకెంతొ ముదంబు జేకుర౯
మానిని గాంచినట్టిపుడు ౖ మానసచింతయుకొంతవీడె, ని౯
మానిని మస్తకంబుగను ౖ మార్గమదెవ్విధిఁజేయ నేర్తునో॥

మారుతి! యింత తడ వేల జేసితి?

ఆంజ:—దేవా! మేము దక్షిణ దిక్కునకు బయనమై సముద్ర తీరంబు జేరి, సీతామాత నెందును గానక చింతించుచుండ, సంపాతి యచ్చట కరుదెంచి, జానకీదేవిని రావణుండు సముద్రోల్లంఘనంబుగావించి, లంకాపట్టణంబునకు గొనిపోయెనని వచించె. అంతట నాతోడ నేతెంచిన వానరుల నటనుండ నియమించి, శతయోజన విస్తీర్ణంబైన సాగరంబుదాటి లంకాపుర ద్వారంబు కడ కేగుతరి, లంకిణియను రక్కసి నన్నడ్డగింప, దానిమదం బడగించితి. పిమ్మట, పురప్రవేశంబుగావించి, రావణుని యంతఃపురంబాదిగాగల సకల ప్రదేశంబులు గలయవెదకితి గాని, యించుకంతయు సీతామాతజాడ గానుపింపదయ్యె. అందుల కెంతయు చింతించి, యశోకవనంబున కేగి, యచట మలిన వస్త్రధారిణియు, రాక్షసస్త్రీ పరివేష్టితయు నగు జానకీదేవిని గాంచి, యామెకు మీక్షేమవార్త నెఱింగించితి. ఆమె సదా మిమ్ములనే స్మరింపుచు మీరాక కెదురుజూచుచుండె.

పాట—24

శ్రీరా:—(విచారముతో) హా! జానకీ! యెట్టియిక్కట్టులకుఁబాల్పడితివి!

పాట—25

పావని! జానకియేమి వచించెనో వేగదెలుపుమా?

ఆంజ:—దేవా! యూఱడిల్లుడు. తదనంతరంబు, మీరొసంగిన యంగుళీయకంబామె కొసంగితి. దానిని గనులనద్దుకొని, కొండొక

తడవు మిమ్ముఁదలఁచి దుఃఖించి, మీతో నిట్లు వచింపుమనియె

తే॥ గీ॥ రెండు నెలలట దశకంఠు ◌ గడువునుమ
కరుణ రాముని రమ్మంటి ◌ గావవనుము
యన్న దమ్ముల నిరువుర ◌ నడిగితినుము
గడువు మీఱిన జానకి ◌ గడచుననుము॥

వెండియు (లక్ష్మణుని వైపుతిరిగి)

తే॥ గీ॥ మాతృభక్తిని నాయందు ◌ మరువఁడెపుడు
యన్న యానతి మీఱని ◌ యనఘుఁడతఁడు
యట్టిమఱఁదిని గఠినోక్తు ◌ లాడినట్టి
పాపఫలమును గనితంచు ◌ బలుకుమయ్య॥

శ్రీరా:— ఆహా! యెట్టిపల్కులను వింటిని! అక్కటా! మారుతీ! గడువేమి? గడచుటేమి?

ఆంజ:—దేవా! దురాత్ముండైన రావణుండు, మాసద్వయంబులోన జానకీదేవి తన్ను వరింపకున్న నాయమను తన కరవాలంబున కెరజేసెదనని ప్రతిజ్ఞజేసె.

శ్రీరా:—ఔరా! యేమి! ఆదుర్మదాంధుని కండకావరము!

లక్ష్మణుడు:—(రావణును దేశించి) ఓరీ! మహాపాతకవర్తీ! రాక్షసాధమా! ఏమిరా ప్రేలితివి? సీతాపహారణంబు నీమరణంబునకు కారణంబయ్యె, సిద్ధంబుగ నుండుము.

ఆంజ:— దేవా! మాసద్వయంబులోన మీరు రావణుని ద్రుంచి, మాసీతామాతను గొనిరాకున్న, నామె ప్రాణంబుల విడచుట నిక్కంబు.

శ్రీరా:—సుగ్రీవా! వింటివిగదా!

తే॥ గీ॥ సమరసన్నాహ మొనరింపు ◌ సత్వరంబు
నాలసించిన భంగంబు ◌ గలుగుమనకు

రావణాసురు వేగ మ ర్దనముచేసి
జనకపుత్రిక గొనిరాగ జనగవలయు॥

సుగ్రీ:— చిత్తము.

శ్రీరా:— వానరులారా ! మీరెల్లరు ప్రయాణంబునకు సంసిద్ధులై యుండుడు. నేడే పయనంబుగావింతము.

వానరులందఱు:—చిత్తము.

శ్రీరా:—(హనుమంతునితో) ఆంజనేయ! నీఋణంబెట్లు దీర్పగలను. నీభక్తికిఁ గడు సంతసించితి. నీవాంఛితం బెరింగింపుము?

ఆంజ:— దేవా!

తే॥ గీ॥ ఎల్లవారలు నీభువి నుల్లమందుఁ
గపటబుద్ధులు విడనాడి కలుషమడచు
మీదు నామంబు నిత్యము మోదమలర
గాన మొనరింప వరమిందు కమలనయన! ॥

శ్రీరా:—తథాస్తు.

మంగళము.

సంపూర్ణము.

---

## ... కీర్తనలు ...



పాట ... 1

సీత:— బేహాగ్ — త్రితాల్

కనకమృగంబదె గాంచుము నాధా॥ క॥
పరిపరివిధముల పరుగిడుచాడెడు॥ క॥
బొంచగ హరిణముల్ ప్రేమజనించెన్
వేగమెజని యా మృగమిటు తెమ్మా॥ క॥

పాట ... 2

శ్రీరాముడు:— బేహాగ్ — త్రితాల్

ఈమృగంబు నన్ను నిటుల మోసగింప
నేమికతమొదో చదామెగా। యీ॥
దనుజమాయ యే మొగా తడయనేల నేనికన్
వడిగదీని మడియజేసి వనితకడకు నేగెదన్ ॥ యీ॥

పాట ... 3

లక్ష్మణుడు:— మాండ్ జిల్లా — త్రితాల్

అరుగన్ యెటులన్ యటవీస్థలినిన్
అవనిజ విడచీ యకటా! నేనికన్॥ అరు ॥
యేనిక చనగన్ యేగతినగునో
మనమున నిటులే చింతిలవలసెన్॥ అరు॥
ఘోరవనంబున క్రూరులచేతన్
తప్పదు రామా! ధరణిజవిడువన్॥ అరు॥

పాట ... 4

శ్రీరాముడు:— బేహాగ్ — త్రితాల్

అవునా, యిటులవునా, యిదితగునా,
యవనిసుతన్ యిటులన్, యటవినివిడువన్ నీకిటు॥ లవునా॥



గనఁ ఘోరమగునా, కాననంబునను విడగా
చోరులకుఁ, దనుజులకుఁ, సఖియట నెంతగమదిని
నరయగ భయమును జెందియునుండెనో॥ అవునా॥

పాట...5

లక్ష్మణుడు:— మాండ్—త్రితాల్

నాదుమాటలవినకఁ, రామా! నన్నునిటులనుబంపెఁ॥ నా॥
ఆహా! నాహరిణమడలఁ గాంచి కడు భీతిఁ రఘురామా!
నన్నుతానిటుబంపెఁ॥ నాదు॥
కటా! మీమహిమగనగఁ జాలకటునఁ హా! శ్రీరామా!
నిష్ఠురోక్తుల బల్కెఁ॥ నాదు॥

పాట...6

శ్రీరాముడు:— యమన్—త్రితాల్

తరమావిధినిలఁ, దాటగ నేరికిఁ॥ త॥
కాననమృగముల, మానినితానటుల్
యడలుచునుండెనో, యకటా! యెటుగఁ
గడువఁ తరమా, కర్మఫలంబహా! ॥ తరమా ॥

పాట...7

శ్రీరాముడు:— హిం॥ ముఖారి—దాద్రా.

ఆహా! హా! నా సీత! యకటా! నిఁబాసినే, నెటులా మనగల,
ఔరా! యీ, ఘోరాటనేమిటో యోనారి॥ ఆహా ॥
యేనాడుననునీవు, వీడానిపడతీవి, యీనాడు యోసీత!
యెటువీడితో నీవు॥ ఆహా ॥

పాట...8

లక్ష్మణుడు:— భీంపలాస్—త్రితాల్

రామా! యిదేలా విచారంబిటుల్ ॥ రామా॥
భూజాతనరయంగ మార్గంబుగనక॥ రామా॥
కాలంబు గడువంగ, కార్యంబు చెడుగా

శోకతపనవిధి సీతా యటకే
జాగేల పయనంబు, సాగింపుమయ్యా॥ రామా ॥

పాట...9

ఆంజనేయుడు:—  యమన్—త్రితాల్

మీదగు చరితము, మోదంబలరగ
వేగమెదెలుపగ, వేడుచునుంటిని॥ మీ॥
శూరులు మీరలు, సుకుమారులు గన
కాన జరింపగ, కారణమేమొకో॥ మీ ॥

పాట...10

శ్రీరా:—  జోన్‌పూరి—త్రితాల్

అకటా! సీతా! అంబరవీధిని యెంతగనీమది
చింతిలినావో॥ అకటా ॥
నన్నడబాసియు మున్నెపుడుండనిదానవు॥ అకటా ॥
మాయరక్కసుడు, మనల నీవిధిన్
మోసముజేయగ, బాసితినిన్ సతి
విధియిటుమనలను, వీడగజేయన్
యేరికగలరహా! ధారుణి మనకిక॥ అకటా॥

పాట—11

లక్ష్మణుడు:—  బేహాగ్—త్రితాల్

ఔర! ద్రోహీ! మోసగింపనగునేనీకు
మమ్మునిటుల దుర్మదాంధుడా ! ॥ ఔర ॥
ధరణిసుతను దెచ్చెదంచు, కాఋలటుల బల్కితౌర!
దురమునందు యిపుడె నిన్ను ద్రుంచెదన్ గాంచుమా

పాట—12

సుగ్రీవుడు—  యమన్—త్రితాల్

కావగవేడెద, కరుణన్ వెసనన్ ॥ కా ॥
మఱచితినయ్యా, మనవిన్ వినుమ ॥ కా ॥

జానకినరయుచు, వానరసేనల
సరగున బంపెద, క్షమియింపుమునన ॥ కా॥

## పాట—13

శ్రీరా:— బీంపలాస్—దాద్రా

అనిలతనయ! దీనిగొనుమ, యానవాలునీకుగా॥ అనిల ॥
రామదూతననుచునిన్ను, రామకిదియె దెలుపుగా॥ అనిల ॥
యెటులనయిన శ్రమకునోర్చి, యేగవయ్య వేగమే
జయముగల్గ పోయిరమ్ము, జనకసుతను గాంచగా॥ అనిల ॥

## పాట—14

ఆంజనేయుడు:— మాండ్ జిల్లా—త్రితాల్

యేవిధి వేగుదు, నేగతినాకిక
జానకిజాడన, గానగలేకన ॥ యే ॥
భూమిజగానక, రామునివదనమున
యేవిధిగాంతున, యేమనిదెల్పుదు॥ యే॥
ధారుణిపుత్రిన, మారుతి! గాంచితె
యనవినినేమని, యనగలవాడన ॥ యే॥

## పాట—15

డైలాగ్:— లంకిణి—ఆంజనేయుడు
హంసధ్వని—దాద్రా

లంకిణి:— నిన్నుజంపి నిన్నుజంపివైచెదిపుడె గాంచరా॥ నిన్ను॥
నన్నుగెలచువారలిలను లేరటంచునెంచరా॥ నన్ను॥
ఆంజ:— ఔర! దుష్టురాలముష్టిఘాతమునకు నిన్నిదే॥ ఔ॥
బలియొసంగి శమనపురికి బంపెదిపుడె గాంచవే ॥ ఔ ।
లంకిణి:— ఓరి! కోతిప్రల్లదంబులాడుచున్న నిన్నికన ॥ఓ॥
జీల్చివైచి నీదురక్తమిపుడె నేను గ్రోలెదన॥ నిన్ను॥
ఆంజ:— రమ్ము రమ్ము నీదు బొమ్ముజీల్చి వేగనేనికన॥ రమ్ము ॥
కాలహరణలేక రాముకార్యమిపుడె దీర్చెదన॥ ఔ॥

పాట—16

[redacted]:— జోన్‌పురి—త్రితాల్

నన్నీతరిఁ కరుణఁ గనురామా ॥ నన్నీ ॥
జీవితేశ్వరా! నీవెగావగా ॥ నన్నీ ॥
నిరతము నిన్నె దమరువని నీసతి
కరుణఁ గనియుఁ గావగరమ్మా
యిడుముల నివ్యోడ బడయఁగజాలను
తడవిక నేలను తరుణిఁ బ్రోవుమ॥ నన్నీ॥

పాట—17

రావణుడు:— హంసధ్వని—త్రితాల్

కండకావరమున నిటులబల్కెదేల పాపిని॥ కండ॥
గడగడంచుజగములెల్ల వడకునాకు దెలియదో॥ కండ ॥
భయముసుంతమదిని వీడి ప్రల్లదంబు లాడెదే,
తరుణివంచుదయదలంచి తలను ద్రుంచ కూరకుంటి॥ కండ॥

పాట—18

సీత:— నాదనామక్రియ—త్రితాల్

హా! హా! ననుబ్రోవవె శ్రీరామా అరయనను
రక్షించుకృపాత్ముఁడ॥ హా! హా! ॥
క్రూరదానవుడు క్రోధముతో నాప్రాణంబుల
గొనబలుకన్, మానసమునఁ, భీతిగలిగెఁ,
కరుణను గనియును వేగమో॥ హా! హా! ॥

పాట—19

అక్ష:— డైలాగ్:— అక్షయకుమారుడు—ఆంజనేయులు.

వ్యర్థభాషణముల నిటుల బల్కెదేల పాతకి॥ వ్యర్థ ॥
దుండగీడ శౌర్యముండ భండనమున జూపుమా॥ వ్య॥

ఆంజ:— భండనంబునలుపనీవు యుద్ధమంచు నెంచరా॥ భం॥
నీదుసఖుల జేరుదంచు నేనుదలచుచుంటిగా॥ భం ॥

అక్ష:— ఓరి! కోతి! యేలయిటుల మేరమీఱి ప్రేలెదా॥ ఓరి ॥
దురమునందు నిన్నుయిపుడె ద్రుంచువాడ గాంచరా॥ వ్య ॥

ఆంజ— కాలమికనుదీరెగాన కదనమునకు రమ్మికన్॥ కా ॥
కాలహరణమేల నింక కాలుపాలికంపెదన్॥ భండ ॥

పాట—20

ఇంద్రజిత్తు:— తిలంగ్—త్రితాల్.

నీమదమడగించెద కనుమో తులువా పలువా॥ నీ ॥
వనమును జెరచితి, యనుజుని దునిమితి, ననుచును పొంగకు
ఖాడింతున్॥ నీ ॥

యెందులకరిగిన నిన్నికవిడువను, ధూర్తుడ! నీవిక నిలువుమురా,
యేరిట నిన్నికగావగ చెనటీ!, పోరడగించెద గాంచుమురా॥ నీ॥

పాట—21

డైలాగ్:— రావణుడు — ఆంజనేయుడు.

రావణుడు:— ప్రేలెదేల పాపియిటుల, బిలుకుమార్చెదిపుడనిన్॥ ప్రే॥
కావరమును జెందినీవు, కన్నుగానవేమిరా। ప్రే॥

ఆంజ:— ఓరీ! క్రూర! దుర్మదాంధ! కాఱులేల ప్రేలెదా॥ ఓ ॥
భూమిపుత్రి బుడమిఱేడు రామచంద్రుకొసగుమా॥ ఓరి॥

రావణుడు:— రాముడెవడు గీముడెవడు, భూమిపతిని నేనగా॥ రా॥
దురమునందు నన్ను గెలచు, వారుగలరె భువినియెందు॥ప్రే॥

ఆంజ:—చేరువయ్యె కాలమంచు, చెనటినీవు యెంచరా॥ చేరు ॥
నీదుపురము నీదుజనులగూడి నీవు నీఱ్గెదా॥ ఓరి॥

పాట—22

సీత:— పూరి—త్రితాల్

పతిచరణములె, గతియనినమ్మిన
పరమసాధ్వియా, ధరణిజయేనిక
అనిలసుతుని యెడ, హవ్యవాహనుడు
శీతలుండగుచు, జెలగెడుగాక॥ పతి॥

పాట—23

శ్రీరాముడు:— పూరి—త్రితాల్

మారుతి భానుజ !, ధారుణి కన్యను
గాంచెనో లేదో, యెంచగజాలహా! ॥ మా ॥
అసురులు క్రూరులు, యకటా! జానకిక
యేమిక జేసిరో, యేగతినాకిక॥ మారు ॥

పాట—24

ఆంజ:— మాండ్ ... త్రితాల్

దేవా! సీతమాత కడు భీతిక, నిరతమ్ముక॥ దేవా॥
తావకచింతయె, భావమునందిడి
క్రూరులచెంతక, గుందుచునుండెక॥ దేవా ॥

పాట ... 25

శ్రీరాముడు:— హిం॥ కన్నడ ... త్రితాల్

హే! సీతా! యీగతిగల్గెనా! హే ॥
హా! ధాత్రీసుత జనకపుత్రి॥ హే ॥
అసురులచెంతక, యకటా! సీతా!
యేవిధి నుంటివో, యెరుగనైతి॥ హే॥